# అవధాన పద్యమంజరి

(అష్టావధాన పద్యముల సంపుటి)



డా॥ అందె వేంకటరాజము
ఎం.ఏ., పిహెచ్.డి.

రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకుడు,

కోరుట్ల, కరీంనగరము జిల్లా.

# AVADHANA PADYA MANJARI
(Collection of Ashtavadhana Poems)

by Dr. Ande Venkatarajam, M.A.,Ph.D.
Retired Telugu Lecturer
Koratla - 505326, Karimnagar Dist. (A P.)

---

## అవధాన పద్యమంజరి - అష్టావధాన పద్యముల సంపుటి

డా॥ అందె వేంకటరాజము, ఎం.ఏ., పిహెచ్.డి.

రిటైర్డ్ తెలుగు లెక్చరరు, కోరుట్ల

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1995.

ప్రతులు : 1000.



ప్రచురణ :
మహేశ్వరీ గ్రంథమండలి, కోరుట్ల.
సప్తమ కుసుమం

వెల : రూ. 45/-

ప్రతులకు :
డా॥ అందె వేంకటరాజము,
మహేశ్వరీ గ్రంథమండలి
2-3-18, మార్కండేయ మందిరం వద్ద,
కోరుట్ల - 505 326, జిల్లా: కరీంనగర్, ఆం.ప్ర.

ముఖచిత్రాలంకరణ : శ్రీ అలిశెట్టి మహారాజు

ముఖచిత్రముద్రణ : బాలాజి ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020.

గ్రంథ ముద్రణ :
పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,
1-1-517/బి/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు - 500 380.
ఫోన్ : 7611413

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులుగారు
ఎం.ఏ., పిహెచ్.డి.
ఆంధ్రశాఖాధ్యక్షులు,
సర్దార్ పటేల్ కాలేజి, సికింద్రాబాదు.

# 'మంజరీ మాధురి'

నవోదయ మణిమంజూషాది కావ్యకర్తలుగా, భారతరాణి భువనవిజయ మాధవవర్మాది రూపక నిర్మాతలుగా అనేక సాహిత్య విమర్శ వ్యాస భాసురులుగా వానమామలై వరదాచార్య కృతి పరిశోధకులుగా ఈశ్వర శతక కర్తలుగా అష్టావధాన కళాతపస్విలుగా సంస్కృతాంధ్ర భాషా విశారదులుగా జ్యోతిర్వేద వాస్తుశాస్త్ర పండితులుగా ఆంధ్రోపన్యాసకులుగా భారతీసాహిత్య సమిత్యధ్యక్షులుగా మహేశ్వరీగ్రంథమండలీ వ్యవస్థాపకులుగా సాహిత్యోద్యమోదార ప్రచారకులుగా కవిసుధాకర కవిశిరోమణి అవధానయువకేసరి ఇత్యాది బహు బిరుద భూషితులుగా సహృదయమిత్ర వతంసులుగా సౌజన్యమూర్తులుగా చక్కని పేరున్నవారు డా॥ అందె వేంకటరాజం గారు.

ధారణాశక్తి, ధారాబలం, సద్యస్ఫూర్తి, హాస్యశీలం, శ్రవణ సహనం, చమత్కార గుణం, పౌరాణిక చారిత్రిక కావ్యశాస్త్ర విజ్ఞాన పరిచయం, లోకజ్ఞానం, స్వచ్ఛమైన ఉచ్చారణ, పద్యగాన యోగ్యమైన సహజ శ్రావ్యకంఠం - ఇవన్నీ అవధాని అవధాన విజయానికి సహకరించే ఆవశ్యక లక్షణాలు. ఏతల్లక్షణోపేతులు మిత్రులు శ్రీ అందె వేంకటరాజం గారు.

అవధానిగా డా॥ అందె వేంకటరాజం గారి ప్రతిభా పాండిత్య పరిమళాలను నలువైపులా ప్రసరింపజేసే ప్రశస్త గ్రంథం ఈ 'అవధాన పద్యమంజరి.' మంజరికున్న మంజిమ మాటల కందదు- మనస్సులకు తప్ప. అలాగే ఈ అవధాన పద్యమంజరి మనోజ్ఞత పలికే పదాల కొదుగదు - అనుభవించే అంతరంగాలకు తప్ప.

ఒక్కొక్క పువ్వులో అందం, మరందం, వన్నె, వాసన, పరాగం, మార్దవం ఎలాగో ఒక్కొక్క అవధానంలో దత్తపది, సద్యోవర్ణన, నిషేధాక్షరి, సమస్యాపూరణం, స్థలప్రశంస, సభాసహృదయ ప్రశంస....అలాగే. పూచిన

పూలన్నింటినీ కలిపితే పుష్పగుచ్ఛం, చేసిన అష్టావధానాలన్నింటిని కలిపితే అవధాన పద్యమంజరి.

తెలంగాణాలోని ఆరు జిల్లాలలో పూనాలో బొంబాయిలో డా॥ వేంకటరాజం గారు 1976 నుండి 1992 వరకు- అంటే పదహారు సంవత్సరాల కాలంలో, ఒక వైపు అధ్యాపకులుగా ఉద్యోగం నిర్వహిస్తూనే మరోవైపు అరవై ఆరు అష్టావధానాలు చేయడం ప్రశంసనీయం. తెంపిన పూలలో కొన్ని చేతినుంచి జారి పోయినట్లు, అందిన పువ్వుల రేకులు కొన్ని రాలిపోయినట్లు, చేసిన అవధానాల నుంచి కొన్ని చేతస్పున కందకుండాపోవడం, కొన్ని అవధానాలలోని కొన్ని పద్యాలు చేతికి చిక్కకుండాపోవడం ఆశ్చర్యం కాదు. అందుకే ఈ గ్రంథంలో నలభై యేడు సంపూర్ణావధానాలూ, ఏడు అవధానాల పాక్షిక పద్యాలూ చోటు చేసుకున్నాయి. ఈ కృతి నిజానికి శ్రీ వేంకటరాజంగారి అవధాన సాహితీ జీవిత జైత్రయాత్రా విశేష సంపుటి. అందుకే ఆయన సుకృతి. ఈ ప్రచురణ సహృదయ పాఠకుల సుకృతం కూడా.

ఈ గ్రంథానికి అవధాని ప్రప్రథమ అష్టావధాన సభా విశేషాలతో- అందు లోనూ ఇష్ట దేవతాది ప్రార్థనతో శ్రీకారం చుట్టడం శ్రీకరం.

ఈ పుస్తకంలోని వివిధ అవధాన స్థల ప్రశంస దేశ ప్రస్తుతిలో ఒక భాగం. అందుకే ఇది రచయిత వేంకటరాజంగారి దేశభక్తిని చెప్పక చెప్పు తున్నది.

ఈ సంపుటిలో గ్రామ - తీర్థ - క్షేత్ర - దేవాలయ దైవత - ప్రసిద్ధ జలాశయాది వర్ణనలున్నాయి. ఇలాంటి ప్రాదేశిక విశేష వర్ణనాత్మక పద్యాలు ఈ గ్రంథ ప్రత్యేకతకు వన్నెలద్దుతున్నాయి. ఆణిముత్యాల్లాంటి ఆ పద్యాలు సహృదయులందరికీ, విశేషించి, ఆయా ప్రాంతాల ప్రజలకు పరమానందాన్ని ప్రసాదిస్తాయనడం అత్యుక్తికాదు.

అభినవ పోతన శ్రీ వానమామలై వరదాచార్యులు, శిరోమణి శ్రీ కేశవ పంతుల నరసింహశాస్త్రి, విమర్శ కాగ్రేసరులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, సౌజన్యమూర్తులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తివంటి విశేష పాండితీ మండితులైన ప్రజ్ఞామూర్తులైన వారి ప్రశంసలు ఈ గ్రంథ సౌందర్యాన్ని ఇనుమడింపజేశాయి.

పూర్వచరణంలో క్రియాప్రయోగం చేసి, సమన్వయంచేత పూరించిన సమస్యలు మరో రకం దీనికి ఉదాహరణ పద్యాలు ఈ గ్రంథంలోని 12, 36 వ పుటలలో చూడవచ్చు.

క్రమాలంకార పద్ధతిలో సమన్వయించి సమస్యలను పూరించడం ఇంకొక రకం. ఇందుకు తార్కాణంగా పుటలు 15, 30 లోని పద్యాలను గమనించవచ్చు.

పద్య తృతీయ చరణంలో ఒకటి లేదా రెండు అక్షరాల సంకలనంచేత లేదా కతిపయశబ్ద సంకలనంచేత సమస్యను పరిష్కరించి పూరించడంకూడా ఒక విధానం. దీనికి నిదర్శనంగా 19, 60 పుటలను గ్రహించవచ్చు.

ఐతిహాసిక పౌరాణిక గాథా వివరణలచేత సమస్యను పరిష్కరించడం మరో విధానం. 21,23 పుటలలోని సమస్యాపూరణపద్యాలను ఇందుకు లక్ష్యంగా భావించవచ్చు.

స్వప్నకల్పనంచేత సమస్యలోని విషమస్థితిని దూరంచేస్తూ సమస్యను పూరించడం కూడా ఉంది 26 వ పుటలోని పద్యం ఇందుకు ఒక మచ్చుతునక.

సమస్యలోని ఒక శబ్దాన్ని శ్లేషార్థంతో గ్రహించి సమస్యను పూరించడం కూడా ఒక మార్గం. దీనిని 40 వ పుటలో దర్శించండి.

సమస్యలోని మొదటి పదాన్ని రూపకాలంకారంగా మలిచి సమస్యను పూరించిన సందర్భం కూడా ఉంది. దీనికి లక్ష్యం 58 వ పుటలోని పద్యం.

సమాసకల్పనంచేత సమస్యను పరిష్కరించిన విధానానికి ఉదాహరణంగా 67 వ పుటను తిలకించండి.

సన్నివేశకల్పనంచేత సమస్యను పూరించవచ్చు. పుట 69 ఇందుకు నిదర్శనం.

సమస్యా పద్యచరణాన్ని పూర్వ-ఉత్తరభాగ విభజన చేసి సమస్యను పరిష్కరించడమూ ఉంది. ఇందుకు ఉదాహరణం పుట 90.

ఇలా తమ బహుముఖ ప్రతిభావిలసనంతో సద్యస్స్ఫురణంతో శ్రీ వేంకట రాజుగారు అవధానాలలో పూరించిన సమస్యాపూరణపద్యాలు విద్వజ్జనహృద్యాలై ఈ గ్రంథ మూల్యాన్ని పెంచుతున్నాయి. కొన్ని చోటులందు సహృదయుల అర్థవైశద్యంకోసం కొన్ని సమస్యలకు తాత్పర్యరచన, నిషేధాక్షరి పద్యవివరణ,

సమస్యాపద్య శబ్దార్థ వివరణ కూడా చేశారు శ్రమించి శ్రీ అందె వేంకటరాజం గారు

భగవద్దత్తమైన ప్రతిభతో శ్రీ వేంకటరాజంగారు దత్తపదులను పూరించిన వైఖరి ప్రశంసనీయం. నిదర్శనంగా 7, 62 పుటలలోని పద్యాలను చూడవచ్చు. దత్తపదిలో ఒకచోట ఐదు పాదాలున్నాయి. అంటే, నాలుగు పదములను ప్రయోగిస్తూ ఐదవ పాదం చేర్చారన్నమాట! తాము ప్రయోగించిన శబ్దాలకు స్పష్టత కోసం అర్థాలు ఇచ్చారు గ్రంథకర్త కొన్నిచోట్ల.

చౌటిపల్లి ప్రశంసాపద్యం (పుట 41) సంస్కృత సమాస సుందరం. అశువుగా చెప్పిన పద్యం ఇంత మనోజ్ఞంగా ఉండడం మెచ్చుకోదగింది. అలాగే ఆసిఫాబాదు ప్రశంసాపద్యం (పుట 47), రావికంటి (రాయికల్లు) ప్రశంసాపద్యం (పుట 59) సహజ శబ్దాలంకారశోభితాలై అమందానందాన్ని కలిగిస్తున్నాయి.

ఇలా అతుల మకరందమధురమైన అవధాన పద్యమంజరిని సహృదయ మిళిందబృందానికి అందించిన మిత్రులు డా॥ అందె వేంకటరాజంగారిని అభినందిస్తున్నాను.

డా॥ కోవెల సంపత్కుమారాచార్యులుగారు,
ఎం.ఏ., పిహెచ్.డి.,
రిటైర్డ్ ఆంధ్రోపన్యాసకులు వరంగల్.

# అవధాన శ్రీముఖం

అవధాన విద్య, అవధాన కళ, దాని ప్రాచీనత, ఉత్పత్తి వికాసాలు మొదలయిన వివరాలు సాహిత్య చరిత్ర పరిశోధకులు విస్తృతంగానే వెలయించారు. అవన్నీ మరలా వివరించుకోవటమనేది ప్రస్తుతానికి అట్లా ఉంచితే, ఒక విషయం మాత్రం చెప్పుకోక తప్పదు. అవధాన విద్య, అవధాన కళ, అవధానాలు ఇత్యాదిగా అవధానాలనుగూర్చి భావించగానే, ఆ భావనతోబాటుగా స్మృతిపథాన్ని ఉజ్జ్వలింపజేసే మహానుభావులు శ్రీ తిరుపతి వేంకట కవులు. వారు దేశాన్ని అవధాన విద్యలో ముంచెత్తారు. అందుకే '—వానలోఁ దడియనివారు, మద్గురు వధానమ్మృదూక్తి మరందధారలో, గడుగని వారు మా కెచటఁ గానఁగ రారిలఁ దెల్గు నాఁడునన్' అని 'ఆంధ్ర ప్రశస్తి' ఆరంభంలో ఆ గురువులకు 'నతి' చేస్తూ విశ్వనాథ సత్యనారాయగారు పులకించిపోయినారు. మరి, ఆనాడంటే, ఆనాటి పలువురు గొప్ప కవులు, పండితులు, అవధానులు ఆ మహానుభావుల విద్యా ప్రతిభా సముద్రం నుంచి ఉదయించినవారే. వారు 'అద్యతనాంధ్ర కవి ప్రపంచ నిర్మాతలు' అంటూ కాటూరి వేంకటేశ్వరరావుగారు, పింగళి లక్ష్మీకాంతంగారు సంభావించారు.

ఇరుగు పొరుగు భాషలు పద్య విద్యను పోగొట్టుకొంటున్న సందర్భంలో అలనాడు శ్రీనాథుడు తెలుగులో నన్నయగారు ఉద్దీపింపజేసిన పద్యవిద్యను నగరవీథుల్లో, పల్లెవాడలలో విహరింపజేస్తూ తన ఆశు, చాటు పద్యాలతో కాశీ ఖండాది కావ్యాలతో శిఖరాగ్ర స్థాయిలో ఒక మనోహర కాంతి ధారగా ప్రవహింపజేశాడు. మళ్ళీ దాదాపు అదే విధమయిన పరిస్థితులు పొడసూపుతున్న సందర్భంలో ఒక చారిత్రక, సాహిత్య, సాంస్కృతికమయిన అవసరంగా తెలుగునాట తిరుపతి వేంకటకవులు పద్యాన్ని ఊరేగిస్తూ జనసామాన్యం గుండెల్లో తాండవింపజేశారు. కవనార్థం బుదయించినా' మంటూ కవిత్వానికి 'పద్యం'

ఒక ఆయువుపట్టు, ఒక నృత్యరంగం, ఒక ప్రవాహశీలం గల వాహిక అనే అంశాన్ని నిరూపించి వ్యాప్తికెక్కించారు. ఆనాళ్ళల్లో వారి ప్రభావంవల్ల దేశంలో ఎంతోమంది జంటకవులు, ఎంతోమంది అవధానులు దేశాన్ని సమావరించు కొన్నారు. 'పద్యం' పరస్పర వ్యవహారంలోకి, ఔత్సాహికుల వైయక్తిక లేఖల లోకి కూడా కొంతవరకు నిరామాటంగా ప్రయాణించింది.

క్రమంగా 'భావ కవిత్వం' కవితారంగంమీద విజృంభించిన కాలంలో పద్యానికి 'మౌన పఠన' విధానం అలవాటు చేయబడినట్టుగా కన్పిస్తుంది. దానితో పద్యం యొక్క ఉపయోగిత అనుభవంలోకి రావటం తగ్గిందేమోననిగూడా అనిపిస్తుంది. 'వచన పద్యం' క్రమంగా వ్యాప్తిలోకి రావటానికి ఇది కూడా ఒక కారణం కావచ్చునేమో? ఆలోచించవలసిన అంశంగా కన్పిస్తుంది. భావ కవిత్వా దులు వ్యాప్తిలోకి వచ్చాక అవధానాలు కొంచెం, కొంచె మేమిటి? బాగానే వెను కాడినట్టు గమనించవచ్చు. కాని, ఇటీవలి కాలంలో మరలా అవధానాలు తెలుగు నాట తమ వెలుగుల్ని ప్రసరిస్తూండటం విరివిగా కన్పిస్తుంది. ఆ మధ్య రాజ మంద్రిలో ఒక వారం రోజులపాటు అష్టావధాన సప్తాహం జరిగింది. ఒక్కొక్క రోజు ఒక్కొక్కరి అష్టావధానం నిర్వహించారు. అట్లాగే వివిధ ప్రాంతాల్లోనూ అష్టావధానాలు జరుగుతూ ఉన్నాయి. గత మార్చిలో ఒక సంపూర్ణ శతావధానం నంద్యాలలో నిర్వహించబడింది. సాధారణంగా శతావధానం వందమందితో సాగాలంటే కనీసం నాలుగు రోజులయినా కార్యక్రమం ఇంచుమించు ఎడతెగ కుండా సాగవలసిందే. అష్టావధానానికి ఇంత కాలవ్యవధి అక్కరలేదు. కొన్ని గంటల కాలపరిమితిలో లేదా వ్యవధిలో అది సమగ్రం అవుతుంది. ఈ కాల వ్యవధి దృష్ట్యా కావచ్చు, శతావధానాల - సంపూర్ణ శతావధానాలకన్నా అష్టావ ధానాలే విరివిగా జరుగుతున్నాయనవచ్చు ఆకాశవాణి, దూరదర్శన్‌లు గూడా అష్టావధానాలను నిర్వహిస్తూండటం గమనిస్తే- దాని లోకప్రియత, అహ్లాదకత సులభంగానే అర్థమవుతుంది.

అవధానులు అవధానాలు చేస్తుంటే జనం అధిక సంఖ్యలో పాల్గొంటున్నా రంటే, అది పద్యం యొక్క శక్తిగా గుర్తించలేకపోవటం మూర్ఖత్వం కన్నా మరోటి అయ్యే అవకాశం లేదు. అవధానికి పద్యం ఎంత స్వాధీనంలో ఉంది? పద్యంపయి ఎంత అధికారం ఉంది? వివిధ పద్యాలను ఎంత సమర్థంగా ప్రయో గిస్తాడు? ఒక్కొక్క అక్షరం చొప్పున ఫలానా అక్షరం ఉపయోగించవద్దంటూ

సమర్థులు నిషేధిస్తూ ఉండే అవధాని ఆ నిషేధాలను అధిగమిస్తూ పద్యాన్ని ఏవిధంగా సమగ్రం చేయగలడు? క్లిష్టమయిన సమస్యలను ఏవిధంగా సమరసం, సరసం చేయగలడు? నిర్దిష్టమయిన భావాన్ని నిర్దిష్టమయిన పద్యంలో అందంగా ఎలా తీర్చగలడు? పరస్పరం అసంబద్ధగానూ, అసందర్భంగానూ, కొన్ని సందర్భాల్లో విరుద్ధంగానూ ఉండే పదాలను విరిచీ వరిచీ ఏ విధంగా అనుకూలించుకో గలడు?- ఈ మొదలయిన అంశాలను గుర్తించి ఆహ్లాదం పొందటానికి జనం వస్తారుగాని, ఏదో ఉపన్యాసం చెబుతారనీ, ఏదో జోక్స్ చెబుతారనీ రారు అసలు గుర్తించవలసిన అంశం ఏమిటంటే - పద్యం లేకుండా 'అవధానం' లేదు. అవధానంలో చమత్కారాలు, మాటనేర్పరితనం, మాట పొదుపరితనం, సద్యఃస్ఫూర్తి మొదలయినవెన్నో ఉంటాయి. అయితే అవన్నీ పద్యావరణంలోనే అవధానంలో గుర్తింపబడుతాయి. పద్యం భావానికీ, భాషకూ, నిర్మాణానికీ ఒక విధమయిన సాంగీతికచ్ఛాయాత్మకమయిన లయ హృదయాల్లో సమన్వయం కలిగిస్తుంది. ఈ సమన్వితికోసమే జనం పద్యాలు వింటారు. ఇక్కడ 'మౌనపఠన' విధానానికి ఏ విధంగానూ ప్రసక్తి లేదు. 'ఊహ తెలియంగల పాఠకోత్తమ'త్వమే ప్రయోజనవంతమవుతుంది.

అష్టావధాన, శతావధానాల్లో ఒక ప్రధానమయిన భేదం ఉంది. శతావధానం ఒక ఋజురేఖ వంటిదయితే, అష్టావధానం ఒకే బిందువు నుంచి సాగిన ఎనిమిదిరేఖలు. పద్యవిషయం వరకు గమనిస్తే ఒక్క నిషేధాక్షరి తప్ప మిగిలిన వన్నీ ఉభయత్రా సమానమే. అష్టావధానం- ఒక విధంగా చెబితే- ద్విముఖమయింది. ఒకటి పద్యముఖం, మరొకటి పద్యేతర ముఖం. ఈ రెండవదానిలో ఉండే నాలుగంశాలు - తేదీ చెప్పితే దాని వారం చెప్పటం, పురాణ ప్రవచనం, ఘంటలు లెక్కపెట్టటం, అప్రస్తుత ప్రశంస అనేవి ప్రధానంగా పద్య విషయమయిన అవధాని అవధానాన్ని చీకాకుపరచటానికి ఉద్దేశించినవి. ఈ నాలుగు అంశాల్లో అవధానులు కొన్ని మార్పులు కూడా చేసుకోవచ్చు. పేకాట లేదా చదరంగం ఆడటం, ఛందోభాషణం.... ఇత్యాదిగా... కాగా, ఈ రెండింటిలో దేనిలోని ఇబ్బందులు దానివే. ఒకటి ఎక్కువా, ఒకటి తక్కువా కాదు. రెండూ అవధాని యొక్క ఆశుధార, పద్యధారణ, సద్యఃస్ఫూర్తి, వివిధ విషయ పరిజ్ఞానం, ఛందస్సామర్థ్యం వంటి వాటికి వరిపిడిరాళ్ళే. మొత్తంగా అవధానం ఒక విధమయిన ప్రదర్శన కళ.

అవధాన పద్యాల్లో బిగువు, భావబంధురత వంటివి ఉండవని ఒక అప వాదు లేకపోలేదు. అందులో కొంత సత్యమూ లేకపోలేదు. అయినా, కవి శక్తి సామర్థ్యాలు, అనుభవం కొంతవరకు ఈ అపవాదును తొలగించుకొన్న సంద ర్భాలు కూడా తక్కువేమీ కాదు. అవధానం ఏకముఖీనంగా గాఢంగా సాగే కావ్య వినిర్మాణ విధానం కాదు. ఇందులో విశ్లథత్వం సహజం. దాన్ని అధిగ మించటం కవిశక్తి. అదీగాక ఈ విధమయిన అపవాదు అవధానేతర పద్యరచన లకు గూడా విరివిగానే వ్యాపించగల లక్షణం ఉంది. అందువల్ల కవిశక్తియే ఈ విషయంలో ప్రాధాన్యం వహిస్తుంది ఈనాడు అనేకమంది అవధానుల అవ ధానాలను గమనిస్తే ఈ అంశం స్పష్టపడుతుంది.

ఈ విధమయిన అవధాన విద్యలో - అవధాన కళలో చాలా కాలంగా కృషిచేసి అందెవేసిన చేయిగా పేరందిన సుకవి శ్రీ అందె వెంకటరాజం గారు. శ్రీ వెంకట రాజంగారు నాకు చాలా కాలంగా మిత్రులు. సౌమ్య సౌజన్యాలు ఆయనలో కలగలిసిపోయినాయి. వరంగల్లులో ఆయన చేసిన ఒక సఫలమయిన అష్టావధానానికి అధ్యక్షత వహించే అవకాశం నాకు కలిగింది. అది ఇప్పటికీ నా మనస్సును ఉల్లాసపరుస్తూనే ఉంటుంది. వెంకటరాజం గారు ఇప్పటివరకు ఎన్ని అవధానాలు చేశారో కచ్చితంగా లెక్కవేసి చెప్పటం కష్టం. అయితే 1976 జూలై నుండి 1992 ఏప్రిల్ వరకు పదహారు సంవత్సరాల్లో చేసిన అవ ధానాలలోని పద్యాలను సంకలనం చేసిన ఈ 'అవధాన పద్యమంజరి'ని చూస్తే 47 అవధానాలు లెక్కకు వస్తున్నాయి. పద్య సంకలనం చేసిన అవధానాలు మాత్రం ఇవే అనవలసిందే తప్ప, చేసిన అవధానాలు ఇన్నే అని చెప్పవచ్చునో, రాదో వెంకటరాజం గారు మాత్రమే చెప్పగలరు.

అష్టావధానంలోని పద్యముఖం మాత్రమే ఈ మంజరిలో మనకు సువ్యక్త మవుతుంది. నిజానికి ప్రధానమయింది ఇదే. దత్తపది, నిషేధాక్షరి, సమస్య, వర్ణన అనే నాలుగంశాలకు సంబంధించిన పద్యాలు మాత్రమే ఈ అవ ధానంలో పద్యముఖం కాగా మరొకటి పద్యేతరముఖమనుకొన్నాం గదా! పద్యే తర ముఖం అంతగా ఈ విధమయిన సంకలనాల్లో ప్రధానం కాదు. కవియొక్క పద్యశక్తి వ్యక్తమయ్యేది ఇందులోనే.

ఒక అవధానంలో వరణము, మరణము, శరణము, చరణము అనే పదా లతో రామాయణార్థంలో పద్యం కోరిన పృచ్ఛకునికి వెంకటరాజం గారు చెప్పిన-

వరణము దుష్టమై వరుని భామిని గోరిన రావణుండు దు
ర్మరణము చెందె; ధర్మమును మానక నిల్చిన రాముడీ ధరా
భరణముగా వెలింగి కడు భక్తుల నర్చితుడయ్యె, తా సదా
చరణ మొనర్చు దేవునిగ, సల్పును దౌష్ట్యము మర్త్య దైత్యుగా.

అన్న పద్యం సోదాహరణంగా నీతిని ఉపదేశించేదిగా రూపు దిద్దుకుంది. (పు.47.) మరొక అవధానంలో 'శనివారము కాదు, కాద శనివారమ్మే' అనే సమస్యను పూరిస్తూ—

ఘన ఝంఝు ఘోరగతి ను
ప్పెనగా జృంభించి ప్రళయ బీభత్సంబున్
బొనరించె మొన్న యయొ! అది
శనివారము కాదు కా, దశనివారమ్మే.

కాదు + అశని అని విరిచి, అంతటి ఘోరం జరిగిన రోజు కేవలం శనివారం మాత్రమే కాదని, అశని (పిడుగుల) వారమని చెప్పటంలో వెంకటరాజంగారి సద్యఃస్ఫూర్తి, సమకాలీన పరిస్థితులను ఉపయోగించుకొనే తీరు మొదలయిన అంశాలు వ్యక్తమవుతాయి. ఈ విధంగా ఈ పద్యమంజరిని ఎన్నో సందర్భాలుగా ఉదాహరించుకోవచ్చు.

వెంకటరాజంగారు అవధానాలలో గేయాలూ, గేయాల వంటి మంజరీ ద్విపదలు ఉపయోగించటం గూడా గమనించవచ్చు. నిజానికి ఆయన పద్య రచనలోనూ, గేయరచనలోనూ చేయి తిరిగిన కవి. వెంకటరాజంగారికి ఆయన పద్య గేయ వచన రచనలకు ఒరవడి గురువుగారయిన వానమామలై వరదాచార్యులుగారు. వారు అభినవ పోతన బిరుదాంకితులు. పోతన మహాకావ్యం రచించినవారు. వరదాచార్యులవారు పద్య గేయ రచనలలో మృదుమధుర కవిగా సుప్రసిద్ధులు. వారి 'భోగినీ నృత్య' ఘట్టం తెలుగునాట మధుర నాట్యప్రవాహాన్ని వెల్లివిరియించింది. అట్లాంటి ఆచార్యులవారి ప్రియశిష్యులు కావటం అట్లా వుంచి, వారి కృతులపయి అతి విస్తృతమూ, వివేచనాపూర్వకమయిన పరిశోధన గ్రంథం రచించి వెంకటరాజంగారు డాక్టరేట్ పట్టం పొందారు. ఆచార్యులవారి పద్య-గేయ రచనా పరిశీలన ఆ రచనల మెలకువలను వెంకటరాజంగారికి అవగతం చేసిందనిపిస్తుంది. ఇందుకు వెంకటరాజంగారి నవోదయం,

మణిమంజూష, మానసవీణ కవితా సంకలనాలు సాక్ష్యమిస్తాయి. వెంకటరాజం గారు పద్య రచనలోనేగాక నాటకరచనలోనూ, వచన రచనలోనూ తమ రచనా శక్తిని ప్రదర్శించారు. 'మాధవ వర్మ' నాటకం, 'సాహితీ జీవన తరంగాలు' ఇందుకు దాఖలాలు. సాహితీ జీవన తరంగాలు ఆయన సాహిత్య కృషి జీవితం లోని రకరకాల అనుభవాల, జ్ఞాపకాల వచన రచన. రచనలోని ఋజుత్వం సహృదయులను ముగ్ధులను చేస్తుంది.

సాహిత్యంలో వివిధ ప్రక్రియలలో కృషి చేసిన, చేస్తున్న వెంకటరాజం గారు అష్టావధానంలోనూ సాఫల్యం పొందటం విశేషం. ప్రస్తుతం అవధాన పద్య మంజరి ఆయన అష్టావధానంలోని నేర్పును వ్యక్తపరుస్తూనే అష్టావధానంలో కృషిచేస్తున్న ఔత్సాహికులకూ, అవధానంలో ఆసక్తి గలవారికి మార్గదర్శనమూ ఆహ్లాదమూ కలిగించే సంకలనం. ఇంతకుపూర్వం ఈ తరహాలో వెలువడిన అవధాన పద్య సంకలనాల మార్గంలో వెలిగించబడిన మరొక దీపం ఇది.

నేనూ, వెంకటరాజంగారూ— ఇద్దరమూ శ్రీముఖులమే. శ్రీముఖ మా ఇరువురి జనన సంవత్సరం. ఆయనకన్నా ఓ నాలుగు నెలలు నేను ముందు- అంతే తేడా. ఈ జన్మ జాతమయిన అప్యాయంతో ఆయన ఈ నాలుగు మాటలు రాసేందుకు అవకాశం కలిగించారని భావిస్తున్నాను. ఈ అవకాశాన్ని పురస్కరించుకొని ఆయన 'కళాతపస్విని' కావ్యం త్వరలో వెలువడాలనీ, ఆయన కావ్య నిర్మాణ శక్తి కూడా పూర్వరచనలవలెనే ఆహ్లాదకం కావాలనీ ఆశిస్తున్నాను.

డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు
హైదరాబాదు

# అభినందనమంజరి

మంజరి అంటే పుష్పగుచ్ఛం. 'బొకే.'

సభలు సమావేశాలలో సాహిత్య సాంస్కృతిక ఉత్సవాలలో గౌరవాహ్వానితులకు ప్రీతి స్వాగత సత్కార పురస్సరంగా సమర్పించే పూలగుత్తి. వారి అధికారాన్నిబట్టి స్థానాన్నిబట్టి కళా సాంస్కృతిక సామాజిక రంగాలలో హోదానుబట్టి ఈ పూల గుత్తి విలువ, పరిమాణమూ కూడా ఆకర్షకంగా ఉంటాయి. ఏ రాష్ట్రపతికో, ప్రధానమంత్రికో, ముఖ్యమంత్రికో 'బొకే' సమర్పించాలంటే అదెంత సొగసుగా అమరుతుందో ఊహించుకోవచ్చు.

నా ప్రియమిత్రులు డా॥ అందె వేంకటరాజము గారిప్పుడు అలాంటి సొగసైన అవధాన పద్యమంజరిని సాహిత్య రసికులైన తెలుగువారికి అందిస్తున్నారు. నా శక్తి కొలది నేనాయనకు అభినందనమంజరిని సమర్పించుకుంటున్నాను. తెలుగు సాహిత్య లోకంలో అవధాన హృద్య ప్రక్రియను గూర్చి వివరించనక్కరలేదు. ఇతర భాషలవారికి ఇతర ప్రాంతాలవారికి తెలుసునో తెలియదో కాని ఆధునిక కాలాన కూడా తెలుగువారికి ఇంటింటా అవధాన విద్య పట్ల అపరిమితాదరాభిమానాలున్నాయి. సంస్కృత విద్వాంసులకు అవధాన ప్రక్రియ బాగా తెలిసిందే. సమస్యాపూరణం వంటి సాహిత్య ఖేలలు యావద్భారత దేశ సంస్కృత విద్వాంసులకు చిరపరిచితమే. నవ ద్వీప పండిత పరిషత్తులో అయల సోమయాజుల గణపతి శాస్త్రి అనే వాసిష్ఠ గణపతి ముని పన్నెండు పదమూడేళ్ళ లేత వయసులోనే- అంటే క్షీరకంఠుడి వయస్సులోనే అఖిల భారతంలో ఖ్యాతి నార్జించిన మహా మహా విద్వాంసులతో సాటిగా ధాటిగా సమస్యాపూరణం చేసి కావ్యకంఠ బిరుదం సముపార్జించుకున్న సంగతి 'నాయన' అనే వాసిష్ఠ గణపతిముని జీవిత చరిత్రలో చూడవచ్చు.

తెలుగునాట ఐదారు వందల సంవత్సరాలనుంచీ అష్టావధాన శతావధానాలు ప్రాచుర్యంలో ఉన్నట్లు చరిత్ర చెపుతున్నది. మన శ్రీకృష్ణదేవరాయల వా

ఆస్థానంలో ఈ విద్యావినోదాలు సాగుతుండేవని కథలు గాథలు చెపుతున్నాయి. చరిగొండ ధర్మన్నవంటి వారు, ప్రగడరాజు నరసన్నవంటివారు పూర్వకాలంలో శత లేఖిని పద్య సంధాన ధౌరేయులనీ, చతుర్విధ కవితా విద్యావిశారదులనీ, సమస్యాపూరణ శక్తి నిపుణులనీ మన పూర్వకవుల చరిత్రలనుబట్టి తెలుసుకొని ఆనందిస్తున్నాము.

ఆధునిక కాలాన నూరు నూటయాభై సంవత్సరాల నుంచి ఆంధ్రదేశంలో అష్టావధాన శతావధాన సభా కార్యక్రమాలను సంస్థానాధిపతులు, సాహిత్య పోషకులు చాలా ఆదరించినట్లు కనపడుతుంది. ఇటు గద్వాల, వనపర్తి, ఆత్మకూరు; అటు బొబ్బిలి వెంకటగిరి పిఠాపురం విజయనగరం నూజివీడు వంటి పెద్ద సంస్థానాలలోనే కాక చిన్న చిన్న జమీందారులు కూడా అవధాన విద్యను ఎంతగానో ఆదరించి ప్రసిద్ధి పొందారు. 'ఆంధ్ర సంస్థానములు - సాహిత్య పోషణ' అనే ఆచార్య తూమాటి దొణప్ప గారి గ్రంథంలో ఈ విషయాలన్నీ ప్రసక్తమై ఉన్నాయి. మాడభూషి వేంకటాచార్యులవారు, తిరుపతి వేంకటకవులు, కొప్పరపు సోదర కవులు అవధాన విద్యను తెలుగు నాట ఎంతో ప్రదీప్తం చేశారు. వారి ప్రతిభను తెలుగువారు ఇంటింట చెప్పుకొని ఆనందించారు.

మరీ ఈ శతాబ్ది ప్రథమ పాదమంతా తెలుగు సాహిత్యంలో అవధాన ప్రక్రియ ఊరూర ఉత్సుకత కలిగించింది. పల్లెటూళ్ళలో కూడా అవధానాలు, ఆశు కవితా ప్రదర్శనలు సామాన్య ప్రజలను కూడా ఆకర్షించాయి.

ఇందుకు మహాకవుల స్పర్ధలు కూడా కొంతవరకు దోహదం చేశాయి. కోస్తా జిల్లాలలోనైతే ఈ శతాబ్ది మొదటి రెండు దశకాలు కవి పండిత సాహితీ దురంధరులంతా శిబిరాలుగా చేరిపోయి సాహిత్య వాగ్వివాదాలకు పూనుకున్నారు. అదంతా నిన్నటి చరిత్ర కాని, రాయప్రోలు వారన్నట్లు "చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర." ఆ పండితులు, ఆ కవులు, ఆ ఈవులు, ఆ సంస్థానాలు గత కాలపు స్మృతి చిహ్నాలుగా మాత్రమే మిగిలిపోలేదు. ఆశ్చర్యకరంగా స్వాతంత్ర్యానంతరం కూడా ఈ హృద్య విద్యను ఉపాసిస్తున్న అనేకమంది ప్రతిభావంతులు మనకు కనపడుతున్నారు ప్రతిచోటా అవధానాలు ప్రదర్శితమవుతూనే ఉన్నాయి.

అవధానం సభారంజకంగా నిర్వహించాలంటే సంస్కృతాంధ్రాలలో గొప్ప పాండిత్యమేకాక, సమయస్ఫూర్తి, లోకజ్ఞత, కవితాధీచాతురి, వాగ్వైశారద్యం,

సృజనాత్మక మేధా ప్రాగల్భ్యం, సరసోదారవచో వైఖరి, ఉల్లాస ప్రవృత్తి ఆ అవధానికి అవసరం. నా ప్రియ మిత్రులు డా. అందె వేంకటరాజముగారి ఈ అవధాన పద్య మంజరిని పరిశీలిస్తే పై చెప్పిన యోగ్యతలన్నీ ఆయనలో ఇరవుకొన్నట్లు స్పష్టంగా తెలిసిపోతున్నది. ఈ సంపుటంలో వారు సుమారు 50 అవధాన ఘట్టాలను పొందుపరిచారు. మొత్తం ఇప్పటికి వారు 66 అవధానాలు చేశారు. వారు అవధానాలు చేయడం ప్రధాన వ్యాపకంగా పెట్టుకొన్నవారు కారు. ఆ విద్యలో వారికుండే ప్రజ్ఞనుబట్టి ఆసక్తినిబట్టి, ఆదరాన్నిబట్టి, కవి పండిత విద్యావంతుల అభిలాషను మన్నించటానికే ఆయా ప్రాంతాలలో అవధానాలు నిర్వహించారు. సాంస్కృతికోత్సవాలు, సంస్థల వార్షికోత్సవాలు, విద్యాసంస్థల సాహిత్య కార్యక్రమాలు మొదలైనవి పురస్కరించుకొని ఈ అవధానాలు చేశారు పూనా, బొంబాయివంటి చోట్ల ఆంధ్ర సంఘాల ఆహ్వానాన్ని అందుకొని కూడా వారు అవధానాలు నిర్వహించారు. మొత్తం పధ్నాలుగు పదిహేను సంవత్సరాల కాల వ్యవధిలో వారు నిర్వహించిన 66 అవధానాలలో 47 అవధానాల విన్యాసం పూర్తిగాను, కొన్ని అవధానాల కొన్ని అంశాలు పరిశిష్టభాగంగాను ఈ సంపుటిలో చోటుచేసుకున్నాయి. ఇవన్నీ అష్టావధానాలు. అష్టావధానంలో మొత్తం ఎనిమిది అంశాలను నిర్వహిస్తారు. దత్తపది, సమస్యాపూరణం, నిషేధాక్షరి, సద్యోవర్ణనం ముఖ్యమైన అంశాలు.

డా. అందె వేంకటరాజముగారు నిర్వహించిన ఈ అష్టావధానాలన్నిటిలోను ఒక విషయాన్ని వర్ణిస్తూ దత్తపదిలో నిర్వహించిన పద్యాలన్నీ ధారాశోభితంగా వారి కవితాత్మను ఆవిష్కరిస్తున్నాయి. సమస్యా పూరణంలో వారి ప్రతిభ మరింత ఆశ్చర్యకరంగా ఆకట్టుకొంటున్నది. మామూలుగా నిషేధాక్షరి పూరణ పద్యం జటిలంగా ఉంటుంది. ఏకాక్షర నిఘంటు పరిజ్ఞాన సంవేద్యంగా ఉంటుంది. అది తప్పదు. అయితే నిషేధాక్షరి నిర్వహణ కూడా సలలిత పదాలతోనే నిర్వహించటానికి అవధానిగారు ప్రయత్నించినట్లు కనపడుతున్నది. కరీంనగర్ జిల్లా ఐలాపురంలో వారు నిర్వహించిన అష్టావధానంలో (పుట 18) గుహుడు శ్రీరామునితో చేసిన విన్నపాన్ని నిషేధాక్షరిలో నిర్వహించిన సందర్భంలో 'శ్రీ పత్కంఠూ యుగ్మంబో పూజ్యా' అని ఎత్తుగడ చేశారు శ్రీ వేంకటరాజముగారు. భాషపై ఎంతటి ప్రభుత ఉంటే ఇటువంటి ఎత్తుగడ సాధ్యమో వేత్తలే నిర్ణయించగలరు. అష్టావధాన కార్యక్రమంలో పృచ్ఛకులకు కూడా

జటిలమైనది నిషేధాక్షరి విన్యాసం. శ్రీ పదమైన నీ పాదపద్మయుగ్మం అని ఈ సమాసానికి శ్రీ అవధానిగారే అర్థవివరణం చేసి - బహుశా ఆనాటి శ్రోతలకు ఆహ్లాదం కలిగించి ఉంటారు. ఈనాటి పాఠకులకు కూడా ఈ నిషేధాక్షరి ద్విగుణీకృతమైన ఆనందాన్ని కలుగజేస్తున్నది. ఈ సంపుటిలోని సమస్యాపూరణం సొగసులు చూపాలంటే చాలా పద్యా లుదాహరించవలసి ఉంటుంది.

హైదరాబాద్ నగరంలోని శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయంలో 1977 లో శ్రీ వేంకటరాజముగారు నిర్వహించిన అష్టావధానంలో వారు వెల్లడించిన అభిప్రాయం ఉదాహరించాలని నాకు చాలా కుతూహలంగా ఉంది. వారన్నారు: పండితులు పట్టుదలతో ఎన్నో అవరోధాలు కల్పిస్తుండగా, సమస్యలనిస్తూ ఉండగా, సృష్టిస్తూ ఉండగా, 'ప్రజ్ఞను చక్కగా నడిపి భావరసాంచిత పద్యరత్నముల్, విజ్ఞులు మెచ్చ జెప్పుచు బళీ! యన నద్భుత సాగరంబునన్, యజ్ఞ సమావధానమున నాడగజేయుట యేరికిశక్యమౌ?' అని శ్రీ వేంకటరాజముగారు సముద్రంలో మునిగి రత్నాలు తీసుకొని రావటంగానూ, ఒక గొప్ప యజ్ఞాన్ని నిర్వహించటంగానూ అష్టావధానాన్ని పోల్చటం ఎంతో సారగర్భితంగా ఉంది.

దత్తపదిలో హయము, రయము, చయము, జయము (మంథెన అష్టావధానం - 1976) అనే పదాలను 'రాముని బంటనిల ప్రసూతి యేచ, యముని గాంచు చందమున జంకెడు భీమునిజూచి నవ్వి' అని సౌగంధికాపహరణ వృత్తాంతాన్ని స్మరింపచేసే సన్నివేశాన్ని ఎన్నుకోవడం ఎంతో కవితా ప్రాగల్భ్యసుందరంగా వుంది. ఈ కవితా సన్నివేశం కూడా ఇక్కడ ఎంతో సౌగంధబంధురంగాఉంది. ఇదే అవధానంలో 'ప్రాతలుపడ్డ భావములు ప్రక్కకుబెట్టి వినూత్న పద్ధతుల్, చేతము ఉల్లసిల్లగను జేకొను చందమునన్ వనిన్' పూలు పూశాయనీ పక్షులు కలరుతాలు చేశాయనీ వర్ణించటం ఎంతో భావుకమనోహరంగా ఉంది.

'సేద్యము, వాద్యము, పద్యము, మద్యము ఉన్నా విద్యుత్తు లేక అయ్యో తక్కెళ్ళపల్లి హృద్యత కోల్పోయిండ' అని చమత్కరించారు శ్రీ వేంకటరాజంగారు (పుట 35). ఇది వారి లోకజ్ఞతను సామాజికాభివృద్ధిలో ప్రాతిపదిక ప్రమాణాల పరిశీలనను చక్కగా వెలారుస్తున్నది.

మామూలుగా సమస్యాపూరణంలో ఏ అవధానిగారైనా సర్వసాధారణంగా చమత్కారాలు చేయడం ఉంటుంది. కాని, వాటిని ఎంత అలవోలగా, ఆహ్లాదక

రంగా నిర్వహించారన్నదే ముఖ్యం. 'పున్నమరేయి భాస్కరుడు పొల్చె మహా తపదీప్తిమంతుడై' (పుట 36) అనే సమస్యను 'గతించెనందమౌ పున్నమరేయి, భాస్కరుడు పొల్చెను....' అని పూరించడం ఎంతో హృద్యంగా ఉంది. ఈ సంపుటి నిండా ఇటువంటి మనోభిరామమైన సమస్యా పూరణాలున్నాయి. "రామున్ దునుమాడె సీత రావణు నాజ్ఞన్" వంటి దుష్కర సమస్యలను ప్రశస్తంగా పూరించారు వేంకటరాజముగారు (పుట 42). ''కడుపుబ్బగ నవ్వదాన గర్భంబాయెన్" (పు. 75) వంటి శృంగారోల్బణంగల విషమసమస్యలను గూడా ఎంతో లలితంగా, శుచిగా, సరసంగా, హర్షోత్కర్షను కలిగించే విధంగా పూరించడం శ్రీ రాజుగారి ప్రజ్ఞను వ్యక్తపరుస్తున్నది. ''లంకేశుడు రాముజంపె లలనేచ్ఛమెయిన్" (పుట 15); 'చెలువుగ రామ రావణులు సీతకు దమ్ములు భీముడన్నయున్" (పుట 30) అనే అతి చమత్కార 'దుస్తరం, నిస్తరేయం' అయిన సమస్యలను అంతకన్నా చమత్కారంగా, ప్రౌఢప్రజ్ఞావిభవంగా ప్రశ్నోత్తర క్రమ్రక్రమాలంకార పరమసుందర శోభాయమానంగా పూరించిన శ్రీ వేంకట రాజముగారి చాతుర్యం మెచ్చదగింది. ఈ విధంగా పరమరమణీయమైన సమస్యా పూరణల నుదాహరించాలంటే పుస్తకంలో చాలా భాగం ఉదాహరించవలసి వస్తుంది. ఒక రామాయణార్థంలోనో, భాగవతార్థంలోనో భారతార్థంలోనోకాక రామాయణభారతార్థాలు రెండూ కలిసివచ్చేట్లు దత్తపది నిర్వహించడం సామాన్యంకాదు (పుట. 33).

ఇవన్నీ అట్లా ఉంచి, అత్యంతాసక్తికరమూ పరమోత్కంఠభరితమూ అయిన ఒక విషయం చిత్తగించండి. 1978 వ సంవత్సరం జనవరి 29 వ తేదిన ఆదిలాబాద్‌లో జరిగిన ఒక అవధాన సభలో పృచ్ఛకులెవరో 'గరుడుడు గణపతికి తండ్రి కావలెనుమ్మా!' (పు. 56) అనే సమస్యను పూరించమన్నారు. సర్గిగా 70 సం॥ల కిందట మద్రాసు నగరంలో ఇదే సమస్యను ఈ శతాబ్ది ఆంధ్రుల అవధాన హృద్య విద్యలో అసమాన సద్యశోవిరాజితులైన కొప్పరపు సోదర కవులు పూరించారు. ఆనాటి పృచ్ఛకులలో శ్రీ కొమ్రరాజు లక్ష్మణరావు, శ్రీ వావిలికొలను సుబ్బారావు, శతఘంటం వేంకటరంగశాస్త్రి, వేటూరి ప్రభాకర శాస్త్రి, కనపర్తి మార్కండేయశర్మ, కానుకొలను త్రివిక్రమరామారావు (కుర్తాలం స్వామివారు), వేదం వేంకటరాయశాస్త్రి, కావ్యకంఠ గణపతిశాస్త్రి, తంజనగరము తేవప్పెరుమాళయ్య మొదలైన హేమాహేమీలు, పండితులు, కవికులాలం

కారులు ఉన్నారు. మరి ఎవరు ఈ సమస్యనిచ్చారో? ఈ సమస్యను శ్రీ కొప్పరపు సోదరకవులు బహుప్రశంసనీయంగా పూరించారు వారి పద్యం ఇది:

''హరుడు గణపతికి బోలెన్
సరసీజాక్షుండు నాభిజన్మ నకుబలెన్
గురుకీర్తి గన్నయా సా
గరు డుడుగణపతికి దండ్రిగావలె జుమ్మీ!''

ఎక్కడి చెన్నపట్నం?! ఎక్కడి ఆదిలాబాదు? మళ్ళీ 70 సంవత్సరాల తరవాత నా ప్రియమిత్రులు డా. అందె వేంకటరాజముగారు హృద్యానవద్యంగా ఈ సమస్యనే ఎంతో సులలితసుందరంగా పూరించారు. వీరిపద్యం ఇది:

''వరవచన మిడినచొప్పున
ధర్మాప్రదక్షిణకు బెండ్లి తనకొనరింపన్
దొరకొన్న పావకుండలి
గరుడుడు గణపతికి దండ్రి కావలెసుమ్మీ!" (పుట 56.)

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు విజ్ఞాన చంద్రికా మండలి పక్షాన కొప్పరపుకవులను ఘనంగా సత్కరించి 'ఆశుకవి చక్రవర్తి' అనే బిరుదిచ్చారు. ఈ సోదరులకు కవిరత్న, అవధాన పంచానన, కవిభూషణ, బాలసరస్వతి మొదలైన ఇరవై బిరుదులుండేవి. మన వేంకటరాజముగారు కూడా శ్రీ కొప్పరపు సోదరకవులు పూరించిన సమస్యను పూరించడం అవధానప్రజ్ఞలో వీరికి గల సామర్థ్యం, వీరికి కలిగిన అదృష్టం తెలియజేస్తున్నాయి. కాబట్టి, మన వేంకట రాజము సుధీమణులకు గల 'కవిశిరోమణి' 'అవధాన యువకేసరి' అనే బిరుదాలు అన్వర్థాలు అని తేటతెల్లమవుతున్నది. మహాపండితులు, మహాకవి శ్రీ వానమామ లై వరదాచార్య స్వామివారి అంతేవాసిత్వం వీరికి లభించటం వీరి గొప్ప అదృష్టం. వీరి సుకృతం. ఆయన అభినవ పోతన. ఈయన అభినవ కేతన. తమ గురువు గారిని గురించి ప్రశస్తమైన పరిశోధన గ్రంథం వెలయించారు కదా మన అందె వేంకటరాజముగారు! వీరు యువతరం కవిపండిత పరిశోధకులలో అందె వేసిన చేయి అని వీరి సుహృద్వర్తనం వెల్లడిస్తున్నది. ఈయన మనస్వి, వచస్వి, వర్చస్వి. 'అంతర్బహిశ్చ తత్సర్వం' పరమ సుందరాకృతి, సుకృతి. వినమ్ర

మూర్తి. ఈయన మాట, వర్తన, రచనా ప్రవర్తన కడు అభిరామమైనవి. ఇంతటి సాధు వినయ పాండిత్యం ఈకాలం సాహితీవ్రతులలో చాలా అరుదుగా కనపడుతుంది.

డాక్టర్ అందె వేంకటరాజముగారు నాకీ అవకాశం కలగజేసినందుకు వారిపట్ల నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. వారు తెలుగువారికి సుందరమైన పద్యపుష్ప గుచ్ఛం బహూకరిస్తున్నారు. వారిని, వారి కవిత్వాన్ని ఎవరూ పరిచయం చేయ నక్కరలేదు. అయినా నామీద వారికి గల ప్రేమాభిమానాదర గౌరవాల వల్ల రెండు మాటలు వ్రాయవల్సిందిగా కోరారు. ఈ అవధాన పద్యమంజరిని పరిశీలించగా నాకు చాలా సంతోషం కలిగింది. అందుకని రెండే ఎందుకని నాలుగు మాటలు రాశాను. నిజానికి కవిత్వపు సొబగులు, పాండిత్యపు లోతులు, ముఖ్యంగా అవధాన పరిశ్రమలోని ప్రజ్ఞ అంచనా వేయగల సామర్థ్యం నాకుందా? నాదంతా ఆధునిక వచన రచనా ప్రక్రియా పరిశీలన పరిజ్ఞానం. అయినా మైత్రిగల చోట కాదనలేము. అందువల్ల నేను ప్రియమాన్య మిత్రులు డా. అందె వేంకట రాజముగారిని ఎంతగానో అభినందిస్తున్నాను. ఇదీ నే నాయనకిస్తున్న 'బొకే.'

ఓ. కే.

శుభం.

# విజ్ఞప్తి

అవధానమంటే ఏ విషయంలోనైనా శ్రద్ధ వహించడం, తత్పరతతో పరిశీలించడం. అవధానమంటే దేనినైనా జ్ఞాపకం ఉంచుకోవడం. ధీః ధారణా వతీ మేధా - అని నామలింగానుశాసనం నిర్వచనం. ధారణాశక్తి యుక్తమైన బుద్ధి మేధ. మేధావి అంటే గొప్ప ధారణాశక్తిగల వాడు. ఎంత చదివినా ధారణ లేకపోతే, అది వానకాలం చదువే అవుతుంది. ధారణగల వ్యక్తి అవసరం కలిగినప్పుడు తన స్మృతి పేటిక నుంచి పెక్కు విషయాలను ఉటంకించి ప్రజలను విశ్వసింప జేయగలడు. కనుకనే ప్రపంచ మంతటా అవధారణగల వ్యక్తికి అపారమైన గౌరవం.

అవధానం కేవలం తత్పరత మాత్రమే. కాని, ఈ తత్పరత అనంతర కార్యం, అనంత ఫలం ధారణ గనుక దానికి కూడ పర్యాయమయింది, లాక్షణికంగా. అవధారణ అంతగా ప్రచారం పొందలేదు. వ్యవహార వైచిత్రి ఇదే.

ఈ అవధాన కళ మనదేశంలో ప్రత్యేకంగా విజ్ఞాన భండారమైన వేదరక్షణతో ప్రారంభమయింది. వేదంలో ప్రక్షేప విక్షేపాలు జరుగకుండా పదక్రమ ఘన జటలతో బిగించి జాగరూకులు కావడంతో అవధానం వేదరక్షణతోనే సంపూర్ణమయింది కూడ. అలాటి వేదరక్షకులు ఘనపాఠులు, అవధానులు అయ్యారు. వేదరక్షకులకు అవధానులు అనే బిరుదు మన రాష్ట్రంలోనే ప్రచురం. ఇతర రాష్ట్రాలలో వేదీ, ద్వివేదీ, త్రివేదీ, చతుర్వేదీ, ఘనపాఠీ, దుబే, తిబే, చౌబే, పాఠక్ అనే వ్యవహారం.

వేదరక్షణకు ఏర్పడిన ఈ అవధాన కళ క్రమంగా ఇతర విషయాలకూ విస్తరించింది. అష్టావధాన, శతావధాన, సహస్రావధాన, పుష్పావధాన, నేత్రావధాన, నాట్యావధానాది బహురూపాలు ధరించింది. ఇతర రాష్ట్రాలన్నిటికన్నా మన రాష్ట్రం దీనిలో అగ్రేసరమయింది, దాదాపు సహస్రాబ్దిగా.

అవధానాలన్నింటిలోను ధారణ, ఆశుకవిత, సద్యఃస్ఫూర్తి మున్నగునవి సమానమే అయినా, అష్టావధానంలో అప్రస్తుత ప్రశంస, ఘంటానాదం, నిషేధాక్షరి చాల చిక్కులు పెట్టేవని నా అభిప్రాయం. ఏదో మంచి సమస్యాపూరణకు ఆలోచిస్తున్న అవధానిని అప్రస్తుత ప్రశంసకుడు దారి మళ్ళించి నానాయాతనకు గురిచేస్తాడు. నిషేధాక్షరి చదరంగం వంటిదే. నిషేధకుని కంటే మూడు ఎత్తులు ముందే వుండాలి అవధాని. ఈ ఎత్తులలో వుండగా టంగ్‌మని గంట. ప్రేక్షకులకే చీకాకనిపిస్తుంది.

విద్వత్కవివతంసులు, మిత్రులు శ్రీ అందె వెంకటరాజం గారు ఈ అవధాన రణాంగణంలో పీరంగం తొక్కి విజయంపొంది తమ పాదాలకేకాక వంశానికే అందెలు వేయించుకొన్న అవధానివతంసులు. దత్తపదుల, నిషేధాక్షరాల పెనుగులాటలో కమ్మని కవిత చెప్పడానికి అవధాని మహావ్యుత్పన్నుడు, నిఘంటువులను నిండుగా మింగినవాడు కావాలి. శ్రీ వెంకటరాజం గారి అవధానాలు రసవంతం కావడానికి కారణం ఈయన కవిత అవధానాల పరిధి దాటి కావ్యనాటకాది క్షేత్రాలకు పారి పసిడిపంటలు పండించడం. ఈయన నవోదయం, మణిమంజూష, మానసవీణ అనే కవితా సంపుటులు; ఈశ్వరశతకం, కళాతపస్విని అనే కావ్యాలు; భువనవిజయం, మాధవవర్మ అనే నాటకాలు; భారతరాణి అనే నాటికా సంపుటి; సాహితీ జీవనతరంగాలు అనే వ్యాస సంపుటి రచించిన లబ్ధప్రతిష్ఠుడు. అముద్రితాలు ఇంకా ఎన్నో.

ఈ అవధాన పద్యమంజరిలో తాము చేసిన 66 అష్టావధానాలలోని 47 అవధానాల పద్యాలు, పరిశిష్టంలో దొరికినంతవరకు తక్కిన అవధానాల పద్యాలు ప్రచురించారు. ఈయన అవధాన పద్యాలు ఎంత మధురంగా వుంటాయో గ్రహించి పూర్తిగా చదువాలనే ఉద్దేశంతో పాఠకులకు కొన్ని పద్యాలు రుచి చూపుతాను.

దత్తపది :- కదను, పదను, అదను, చదను అనే పదాలతో భారతార్థంలో పద్యం. (పుట. 5)

కదను ద్రొక్కుచు భూమికంపిల
గౌరవేంద్రుని సైన్యముల్
పదను జూపుచు నూపివేయగ
ఖాండవేయుడు రుద్రుడై

అదనుచూచి ప్రచండ తాండవ
మాడె ఖండన భూమిలో
చదను పల్లము మిట్టనారయె
శత్రు వీరులు పారగా.

నిషేధాక్షరి : వామన చరిత్రను గురించి (పుట 52).

కం. రక్షోరాట్ శ్రీ దోచన్
భిక్షకు నే బైసిగాక బేంయసన్ దా
నక్షయ మగు మూడడుగుల
నాక్షితిలో నడిగె వటుడు అబ్బుర మొదవన్.

సమస్య : మలమునుగొని రమణియోర్తు మరిమరి మురిసెన్ (పుట 60).

కం. చెలువగు వలువలు దాలిచి
కలితాలంకరణగా నిగారముగా మ
ల్లెలు తురిమి మెచ్చుగా ఒరి
మలమును గొని రమణి యోర్తు మరిమరి మురిసెన్.

శ్రీ వెంకటరాజంగారి కవితా కమనీయానికి మచ్చులు మూడు చూపాను. వీరి అవధాన పద్యాలు ఎంత సహజ సరళంగా జాలువారినవో చెప్పడానికి ఈ మంజరిలోని ప్రతి పూవురేకూ తార్కాణ. శ్రీ వెంకటరాజంగారు, ఇప్పుడిక తీరికే గనుక తక్కిన 34 అవధానాలూ పూర్తిచేసి సెంచరీ కొడుతారని విశ్వసిస్తున్నాను.

ఇంతటి సురభిళమైన అవధాన పద్య మంజరిని ఆఘ్రాణించి ఆనందించే అవకాశం కలిగించినందుకు శ్రీ వెంకటరాజంగారికి కృతజ్ఞతలు తెలుపుకొంటు న్నాను.

# అంకితము

శ్రీ పాలకుర్తి వంశా
కూపారసుధాకరా! సుగుణరత్నఖనీ!
దీపటిమాభ్యున్నతి పద
సోపానారోహక! మధుసూదనరాయా!

గణనీయంబుగ స్నాతకోత్తర కళాగ్రప్రాజ్ఞులై రమ్యులై
పుణి సారస్వత సింధువున్ దరిచి యేపుల్గా కొమఃట్టాజు ల
క్ష్మణరాయ ప్రథితాంధ్ర సాహితి ప్రశస్త స్ఫూర్తి శోధించి భూ
షణమున్ గూర్చితి రాంధ్రభారతికి శశ్వత్కీర్తి రత్నద్యుతిన్.

అవకాశంబు లనేక మిచ్చి సతతం బాకాశవాణిన్ రహిన్
కవులన్ పండితులన్ కళానిలయులన్ కాంక్షారసజ్ఞత్వముల్
మివులన్ తుష్టిని పుష్టి గూర్చుచు నవోన్మేషోపలబ్ధిన్ విధుల్
నవరింపన్ కృషిసల్పువార లసదృక్షం బోహా దక్షత్వముల్!

సారస్యంబు పరిమళించు వరసౌజన్యంబు శోభిల్లు వి
స్తారోదారపరోపకార గుణ ముద్భాసిల్లు నుత్కృష్టకా
ర్యారంభంబు విజృంభితంబగు నుదగ్రాలోచనల్ రాజిలున్
ధీరోదాత్తత రూపుగొన్న తమ వ్యక్తిత్వంబు సామాన్యమే.

సంచాలక వర్యులయి స
మంచిత కార్యముల బహుసమర్థత వెలయన్
పెంచి దశదిశల మార్మ్రో
గించితి రాకాశవాణి కీర్తి విపంచిన్.

ఆశ్రితకోటి కాప్తులయి యందరి మన్నన గాంచుచున్ మహా
విశ్రుతులైన పెద్దలను పిన్నల నౌచితి నాదరించుచున్
విశ్రమ వింత లేకెపుడు విన్నను వొప్పగ కార్య జాల మెం
తో శ్రమ కోర్చి తీర్చెదరు తోయధితుల్య మహాగభీరతన్.

ఉచితానుచితనిబోధన
సచివోత్తములై సుకవుల సత్కారములన్
పచరింప కృష్ణరాయల
ప్రచుర రసికత యలరారు ప్రాజ్ఞవరేణ్యా!

నను, మీ చిత్తమునందు తావొసగి నానారీతులన్ గారవం
బున చేయూతల ప్రోత్సహించి యనయంబున్ కావ్యగానాది కా
ర్యనికాయంబుల నిచ్చి మేల్ సలిపినా రాకాశవాణిన్, మనం
బున నే నాడును విస్మరింతునె భవద్భూయిష్ఠ సాహాయ్యముల్.

కర మనురక్తి గౌరవము గ్రాలగ ఈ యవధాన పద్యమం
జరి నుపహార మిచ్చెదను సన్మతి స్వీకరణం బొనర్చి బం
ధుర యశమున్ చిరాయువు వినూతన తేజము స్వాస్థ్య సంపదల్
నిర సుఖశాంతు లభ్యుదయ దివ్య పరంపర గాంచి వెల్గుడీ!

# విన్నపం

సహృదయ సాహితీ బంధువులారా!

ఇది నా ముద్రిత గ్రంథాలలో పదవది. మహేశ్వరీ గ్రంథ మండలి సప్తమ కుసుమంగా అందిస్తున్నాను. దీనికి పూర్వం ప్రచురించిన 'సాహితీ జీవన తరంగాలు' గ్రంథంలో నా సాహితీ జీవన వికాస దశలను సవివరంగా తెలుపుకొంటిని

తారుణ్య దశలో 12 వ ఏట నాలో కవితా లతావిర్భావం జరిగి గురువరేణ్యులు శ్రీ మద్వానమామలై వరదాచార్యులు, ఆచార్య సి. నారాయణరెడ్డి గారల ఆశీర్వాదానుగ్రహాల వలన క్రమంగా కుసుమించి ఫలవంతమయి అనేక కృతులను రచించి ప్రచురించి సరససాహితీలోకానికి అందించితిని. అవి పద్య గేయ ఖండకావ్యాలు, శతకం, నాటికలు, నాటకం, పరిశోధన (సిద్ధాంత) వ్యాసం, సాహిత్య వ్యాసాలు మున్నగు వివిధ ప్రక్రియలలో వికాసిల్లినవి. ప్రస్తుతకృతి నా అష్టావధానాల పద్యాల సంకలనం 'అవధాన పద్యమంజరి'గా సమర్పిస్తున్నాను.

నాలో అష్టావధానకళ ఆవిర్భవించడం అదొక దైవయోగం, పూర్వజన్మ సుకృతం. మా కోరుట్లలో తేది. 26-10-1975 నాడు చేనేత సహకార సంఘ రజతోత్సవాలు, పద్మశాలి కులోన్నతి సంఘ రజతోత్సవాలు - ఈ రెండింటికీ అధ్యక్షులుగా ఉన్న శ్రీ ఎక్కలదేవి లక్ష్మణగారి షష్టిపూర్తి సన్మానోత్సవం జరిగిన సందర్భంలో ప్రముఖ విద్వత్కవివరేణ్యులు డా॥ సి. వి. సుబ్బన్న శతావధానిగారి అష్టావధానం జరిగినది. ఆ పిదప కొన్నాళ్ళకు 1976 ఏప్రిల్‌లో మా భారతీ సాహిత్య సమితి ప్రధాన కార్యదర్శి, ఆత్మీయులు, సుకవివరేణ్యులు శ్రీశ్రీ గాదె శంకర కవిగారు, సంఘ సాంస్కృతిక కార్యదర్శి ఆత్మీయులు సుకవిలలాములు, గాయకులు, దర్శకవర్యులైన శ్రీ బైరి నరసయ్యగారు నన్ను అష్టావధానం చేయవలెనని ప్రోత్సహించగా అవధానం చేసినాను. ప్రపథమంగా అనూహ్యంగా అవధానం చేయగలిగినందుకు మిత్రులతోపాటు నేనూ ఆశ్చర్యానందాలకు లోనయినాను. అది అనిర్వచనీయానుభూతి. ఈ విషయమెల్ల నా 'సాహితీ జీవనతరంగాలు'లో వివరించినాను. తరువాత ప్రియమిత్రులు శ్రీ కమఠం శంకరయ్య కవిగారు, 'జ్యోతిష సమ్రాట్' శ్రీ గోనె విఠలుగారు, అప్పటి నా సహోపన్యాసకులు శ్రీ వి. వెంకటరావుగారు అవధానావిర్భావ ప్రారంభదశలో ఎంతో దోహదం చేసినారు. గురుదేవులు, మహాకవి శిరోమణి డా॥ వానమామలై వరదాచార్యులవారు అభినందించి, ఆశీర్వదించినారు.

నేను విద్యార్థిదశనుండియే అప్పుడప్పుడు పద్యా లాశువుగా చెప్పడం, సమస్యలు పూరించడం వంటివి చేసేవాన్ని. అంతేకాని, అవధానం చేయలేదు. ఎం.ఏ పరీక్షకు చదివిన కాలంలో అధిక శ్రమవల్ల కృశించి క్షయవ్యాధిగ్రస్తుడనై, చికిత్సవల్ల స్వాస్థ్యం పొందినా జ్ఞాపకశక్తి చాలా దెబ్బతిన్నది. ఆ రోజులలో - 1973లో బహుజన్మ సుకృతంవల్ల శ్రీ సర్వమంగళాదేవీ మంత్రోపాసన చేసితిని. ఆ పరమేశ్వరి కరుణచేత కుండలినీ జ్ఞానయోగీంద్రులు, అవధూత శ్రీశ్రీశ్రీ గోవిందగిరి స్వాములవారి దర్శనభాగ్యం లభించి, వారిచేత కుండలినీ జాగృతి పొంది యోగనిష్ఠ చేసితిని. అందువల్ల గొప్పగా మేధాశక్తి ప్రజ్వలితమై, ధారణాశక్తి విరాజిల్లినది. తత్ఫలితంగా నేను అవధానాలు చేయగలిగినానన్నది నా దృఢవిశ్వాసం.

అష్టావధానంలో ఎనిమిది విభిన్నాంశాలుండునన్నది విదితమే. నేను దత్తపది, సమస్యాపూరణం, సద్యోవర్ణన, నిషేధాక్షరి, పురాణకాలక్షేపం, వ్యస్తాక్షరి, అప్రస్తుత ప్రశంస, ఘంటాగణనం అనే అష్టాంశాలను నిర్వహించినాను. అరుదుగా ఛందోభాషణం కూడా చేసినాను. నే నవధానాలు చేస్తున్న విషయం తెలిసి మిత్రులు అభిమానులు కవిపండితులు ఆయా సాహిత్యాది సంస్థల నిర్వాహకులు సాదరంగా ఆహ్వానించి అష్టావధాన కార్యక్రమా లేర్పాటు చేయించి సన్మానించినారు. కోరుట్లలో తేది 9.8.1976 నాడు జరిగిన అవధాన సభలో గురుదేవులు శ్రీ వరదాచార్యులవారు 'అవధాన యువకేసరి' అనే బిరుదం ప్రసాదించినారు. కరీంనగర్, నిజామాబాదు, ఆదిలాబాదు, వరంగలు, ఖమ్మం జిల్లాలలో అనేక ప్రదేశాలలో, హైదరాబాదు పూనా బొంబాయి నగరాలలో ఇప్పటివరకు 66 అవధానాలు చేసినాను. నేనొనర్చిన 66 అవధానాలలో కొన్ని అలభ్యమైనవి. లభ్యమైన 47 అవధానాల పద్యాలను సంపూర్ణంగాను, పరిశిష్టంగా 7 అవధానాల పద్యాలు పాక్షికంగాను ఇందులో పొందుపరచినాను.

అవధానం చేయడానికి పాండిత్యం, రచనాశక్తి, ఆశుకవిత, సమయస్ఫూర్తి, ధారణాశక్తి మున్నగునవి సమగ్రంగా సరసంగా ఉన్నా, మానవశక్తియుక్తులకు దైవానుగ్రహం తోడుకానిది విజయవంతం కాజాలదని నా అనుభవం వల్ల మనవి చేస్తున్నాను. ఈ విషయం నా కనేకపర్యాయా లవగతమైనది. ఒకనాటి అనుభవం విన్నవిస్తాను. తేది 11.12.77 నాడు కరీంనగరంలో జరిగిన అవధానంలో—

'శనివారము కాదు కాద శనివారమ్మే'

అన్న సమస్య ఇచ్చినారు. అది నాకు సమస్యగానే తోచలేదు. మరి పరిష్కారమేమిటి? పూరణ మెట్లు? తదితరాంశాలకు సమాధానాలు చెపుతూనే తీవ్రంగా

ఆలోచిస్తున్నాను. ఆలోచన సాగకుండ అప్రస్తుత ప్రశంస, వ్యస్తాక్షరి, ఘంటలు విజృంభిస్తూ అవరోధం కలిగిస్తూ వేధిస్తున్నవి. ఒక ఆవృత్తి ముగిసి రెండవ ఆవృత్తి సాగుతున్నది. సమస్య నిచ్చిన పృచ్ఛకులు 'ఏమండీ అవధానిగారూ! నా సమస్యను పూరించరా? ఒకవేళ పూరించరాదంటే వేరొక సమస్య ఇస్తాను. లేదా విరమించుకొంటాను' అన్నారు. నేనేమాత్రం చలించక 'అదేమిటండీ, మీరు మరీ త్వరపడుతున్నారు. తప్పక దీనినే పూరిస్తాను. మొత్తం మీద అవధానమయ్యే లోగా పూరణం పూర్తి చేస్తాను' అన్నాను. పృచ్ఛకుల దాడులను త్రిప్పికొడు తూనే తీవ్రంగా ఆలోచిస్తున్నాను. కాని, ఏ మాత్రం దిక్కుతోచలేదు. అప్పుడు వేదన మొదలైనది. భయాందోళన లావరించినవి. అనన్యచిత్తంతో క్షణ కాలం ఇష్ట దైవం పరమేశ్వరిని ఆర్తితో ప్రార్థించినాను. అంతలో ఏదో నాలో ఆవేశించి నట్లై దివి సీమలో తుఫాను చెలరేగిన విషయం స్ఫురించినది. వెంటనే ప్రారం భించి—

'ఘన ఝుంఝు ఘోరగతి ను
ప్పెనగా జృంభించి ప్రళయ బీభత్సంబున్
బొనరించె మొన్న యయ్యో! యది
శనివారము కాదు కా దశనివారమ్మే' (పుట 52)

అని పూరించినాను. సభికులు కరతాళ ధ్వనులతో హర్షం వ్యక్తం చేసినారు. ఇలా ఒక భయంకరమైన గండం దుర్గాదేవి కరుణవలన గడచినది. అరుగుల గ్రామంలో జరిగిన అవధానంలోను—

'పతి సుతునిన్ బతినిజంప భామిని యేడ్చెన్' (పుట 21) అనే సమస్యను పూరించడంలో దైవానుగ్రహమే గట్టెక్కించినది.

అవధానాలు కొన్నిచోట్ల అవలీలగా నిర్వహించినాను. మరికొన్నిచోట్ల పృచ్ఛకుల అగ్నిపరీక్షలకు గురియైనాను. ఎందరెందరో ప్రోత్సహించి ఆదరించి అభినందిస్తే, క్వాచిత్కంగా ఈర్ష్యాద్వేషాలతో పడగొట్టే ప్రయత్నం చేసినారు. ఐనా పొంగిపోలేదు, క్రుంగిపోలేదు. అవధానా లెక్కడా విఫలం కాలేదు, విజయవంతమే ఐనవి ఈతకుమించిన లోతు లేదుకదా! దైవానుగ్రహం ఉండనే ఉన్నది. పూజ్యగురుదేవుల ఆశీర్వాదం, పూజ్యగురుపాదులు ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, 'శిరోమణి' కేశవపంతుల నరసింహశాస్త్రిగారు మున్నగు పెద్దల ఆశీస్సులు, మిత్రుల శుభాకాంక్షలు తోడై, అవధానరథ ప్రయాణాలను నిర్విఘ్నంగా విజయవంతంగా గమ్యం చేర్చినవి.

ఈ అవధానపద్యమంజరిని మాన్యులు సహృదయ విద్వద్వరేణ్యులు ఆకాశవాణి వరంగలు సంచాలకులు డా॥ పాలకుర్తి మధుసూదనరావుగారికి గౌరవపురస్సరంగా అంకితం చేసినాను. మధుసూదనరావుగారు సాహితీలోక బాంధవులు, సరసోదారచిత్తులు, సద్గుణ సంపన్నులు, పిన్నలను పెద్దలను సముచితంగా ఆదరించే విశాలహృదయులు. అసంఖ్యాకంగా కవులకు పండితులకు కళాకారులకు ఆకాశవాణి కార్యక్రమావకాశాలిచ్చి ప్రోత్సహించిన మహనీయులు. నాయెడల వారికి అవ్యాజానురాగం. ఆకాశవాణిలో అనేక పర్యాయాలు నానావిధ సాహిత్య కార్యక్రమాలిచ్చి ప్రోత్సహించి సత్కరించినారు. వారికి కృతజ్ఞతతో ఈ కృతిని సమర్పించినాను. వారు దయతో స్వీకరించినందులకు పునఃపునః కృతజ్ఞతాభివందనాలు.

ఈ కృతికి దయతో అమూల్యాభిప్రాయాలను వ్రాసిన మాన్యులు సహృదయ విద్వద్విమర్శకవరేణ్యులు శ్రీయుతులు డా॥ తిరుమల రామచంద్రగారికి, డా॥ కోవెల సంపత్కుమారాచార్యులుగారికి, డా॥ అక్కిరాజు రమాపతిరావుగారికి, డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు గారికి కృతజ్ఞతా నమోవాకాలు. గ్రంథముద్రణకు దయతో ద్రవ్య సహాయం చేసిన దాతలకు కృతజ్ఞతాంజలులు. గ్రంథానికి రమ్యమైన ముఖచిత్రం వేసిన ఆత్మీయులు చిత్రకార శిరోమణులు శ్రీ అలిశెట్టి మహారాజు జగిత్యాల గారికి, ముఖచిత్ర ముద్రణ చేసి ఇచ్చిన బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, చక్కగా సకాలంలో గ్రంథ ముద్రణ చేసిన పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీ పి. శ్రీనివాసగౌడు గారికి, ముద్రణలో సహకరించిన ఆత్మీయులు సుకవీంద్రులు శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడు గారికి అనేక కృతజ్ఞతలు.

అవధానాలు ఏర్పాటు చేయించి సన్మానించిన సాహితీ బంధువులందరికి ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు.

అవధానాలు వంద చేయవలెనన్న అభిలాష ఉన్నది. మిగిలిన అవధానాలు సహృదయ సాహితీలోకం చేయించి ఆదరించగలదన్న విశ్వాసం ఉన్నది.

ఈ అవధాన పద్యమంజరి సౌరభ పరంపరలకు సరస సారస్వతహృదయాలామోదానుస్పందనం చెందితే నా కృషి చరితార్థమైనదని భావింతును.

ఇట్లు
విధేయుడు
అందె వేంకటరాజము

కోరుట్ల,
21-7-1995

# గ్రంథముద్రణకు విరాళాలిచ్చిన దాతలు

సర్వశ్రీ

2000.00 మాదాసు రమేశ్‌బాబు, డిప్యూటి సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్, హైదరాబాదు.

1016.00 మల్లయ్య, నారాయణ మిట్టపల్లి గారల ధర్మనిధి, పూనా.

516.00 ముగ్గా కాంతయ్యశేటు, మెట్టుపల్లి.

251.00 గౌడ సంఘం, ఐలాపురం.

151.00 యెల్ది భూమయ్య, పూనా.

151.00 చిప్ప లక్ష్మణ్, పూనా.

116.00 డా॥ బాస రాజేశ్వర్, M.S; సాయి హాస్పిటల్, కోరుట్ల.

116.00 రహీం పాషా, వైస్ చేర్మన్, పురపాలక సంఘం, కోరుట్ల.

116.00 బద్దం నరసింహారెడ్డి, తొర్తి.

116.00 చెన్నమనేని హనుమంతరావు, మన్నెగూడెం.

51.00 మలయశ్రీ, తెలుగు పండితులు, కోరుట్ల.

---

# శోధిక

| తప్పు | ఒప్పు | పుట |
|---|---|---|
| కోరుట్ల | కొరుట్ల | 9 |
| ఛిత్తులన్ | చిత్తులన్ | 14 |
| దీనజనావళి | దీనజనాళి | 23 |
| ఆయసంబుతో | ఆయాసంబుతో | 43 |
| రుద్దాంఘ్రియైె | రుద్దాంఘ్రియై | 43 |
| విద్యత్స్వత | విద్వత్స్వత | 69 |
| ముఖ్యతిథి | ముఖ్యాతిథి | 70 |
| రూపిమెత్తి | రూపమెత్తి | 88 |
| జోతిషము | జ్యోతిషము | 95 |
| నరసింహశాత్రి | నరసింహశాస్త్రి | 105 |
| వుత్రికయై | పుత్రికయై | 109 |
| జోతిష్కళా | జ్యోతిష్కళా | 116 |

# సూచిక

## పరిశిష్టము

# అవధానపద్యమంజరి

## ఇష్టదేవతాప్రార్థనాదికము

### శ్రీ సర్వమంగళాదేవీస్తుతి :

ఉ. శ్రీవిలసచ్ఛుభంకరిని జిన్మయరూప దయాపయోనిధిన్
దేవమునీంద్రవందితను దీనజనార్తిహరన్ శివన్ మహా
దేవమనోవిహార జగతీప్రకరేశ్వరి సర్వమంగళా
దేవిని బ్రస్తుతించెదను దివ్యజయోన్నతు లుల్లసిల్లఁగన్.

### శ్రీ గణపతిస్తుతి :

ఆ.వె. ఆదిదంపతులకు నను~గు బిడ్డండవై
యగ్రపూజ లందు నమరముఖ్య!
విఘ్నములను గూల్చి విజయంబులన్ దేల్చు
శ్రీ గణాధినాథ! చింత చేతు.

### శ్రీ గోవిందగిరి స్వాములవారి స్తుతి :

క. శ్రీమద్భగవత్పాదులఁ
గామాదికవైరివిజయఘనకుండలినీ
రాముల గోవిందగిరి
స్వాముల సద్గురులఁ దలఁతు జయ మదరింపన్.

డా॥ అంధె వేంకటరాజము

## శ్రీ వాసమామలై వరదాచార్యులవారి స్తుతి :

చ. అభినవపోతనన్ గవికులామృతసాగరపూర్ణచంద్రు దీ
విభవసురేంద్రదేశికుఁ బవిత్రతమార్గవిశిష్టజీవన
ప్రభు వరదార్య మద్గురుని భవ్యరసజ్ఞజగద్విధాతృనిన్
సభ విజయంబు గాంచుటకు సన్నుతిచేసి నమస్కరించెదన్.

## సభాప్రసంశ :

చ. సభ యొక యంబుజాకరము సర్వరసజ్ఞులు భృంగపాళి దీ
ప్రభ సుకళామరందములు గ్రాలెడు పృచ్ఛకపండితుల్ మహా
విభవము గుల్కు పత్రములు పేరిమి నే నిటఁ గర్ణికన్ సభా
విభుఁ డొక మూలకంద మయి వెల్గఁగ రంజిలదే ప్రశస్తమై.

## విజ్ఞప్తి :

చ. తిరుపతివేంకటాదికవిధీరు లనేకులు మున్ను రమ్యమై
వఱల వధానకార్యములు బాగుగఁ జేసిరి వారి దారిలో
దొరకొని సాగిపోయెదను దొంటి మనీషుల యంతవాఁడఁగా
నిరవుగఁ బ్రాజ్ఞసన్నిధిని నే నొనరించెదఁ జిత్తగించుఁడీ!

# కోరుట్ల

(కరీంనగర్ జిల్లా)          తేది : 4-7-1976

## దత్తపది :

హరిజనులు, గిరిజనులు, పురజనులు, అరిజనులు- గీతా ప్రబోధము గురించి.

చ. హరిజను లైనవారె పరమాత్ముని భక్తి భజించుచుందు, రే
గిరి జను లాత్మవాదము నొకింతయు మెచ్చక వ్యర్థజన్ములై,
పురజను లెల్ల దత్త్వమును బుద్ధి నెఱింగి చరించు చుండఁగా,
అరిజను లేమి నవ్వినను నాత్మవహింపరు చింత సుంతయున్.

## సద్యోవర్ణన :

శ్రీకృష్ణుని గోపికా వస్త్రాపహరణము గురించి.

ఉ. కల్వల ప్రోగులో యనఁగఁ గ్రమముఖంబుల గోపికాసతుల్
వల్వలు విప్పి యా యమున వారిని జేరి మనోజ్ఞకేళులన్
జెల్వలు చేయఁ గృష్ణుఁ డటఁ జేరి పటంబులు దొంగిలించి యా
చెల్వము నేత్రపర్వముగఁ జిల్పిగఁ జూచెను దోఁచె స్వర్గముల్.

## సద్యోవర్ణన :

పాట కచ్చేరి నడుమ తబలా తూటుపడగా అప్పటి స్థితిగురించి.

ఉ. గానము సాగుచుండఁ గడు గట్టిగఁ గొట్టిన దెబ్బ కోర్వకన్
ప్రాణము పోయెనో యనఁగ బొమ్మని తూఁటుపడంగ తబ్ల కా
గానము జీరవోయె, శ్రుతి గానక గాయకుఁ డార్చె, శ్రోత లెం
తేని జివుక్కుమంచు నెదఁ దీవ్రతరంబుగఁ దల్లడిల్లగన్.

**సమస్య :**

కొడుకును జేరఁబోయి యొక కోమలి తేలెను మారుకేళిలో.

చ. అడరిన కామ మగ్నివలె నట్టిటు చేయఁగఁ దాళజాలమిన్
బుడుతల నిద్రబుచ్చి పలుపోకల బంటులఁ బంపి యద్దిరా!
గడుఁసుదన మ్మదేమనఁగ గద్దఱి కామిని మేనయత్త మేల్
కొడుకును జేరఁబోయి యొక కోమలి తేలెను మారుకేళిలో.

**నిషేధాక్షరి :**

భారతీసాహిత్యసమితి గురించి.

క. శ్రీరామావాగ్రజనీ
మారోద్యత్కాంత లలరి మహ మదరింపన్
సారకవిత్వం బమలా
సారం బురుగీతి యొప్పె సద్భారతిలో.

**శ్రీ గోనె విఠలుగారికి శుభాకాంక్షలు :**

ఉ. గోనెకులాబ్ధిచంద్రములు, కోవిదవర్యులు, విఠ్ఠలాఖ్యు లెం
తేనిఁ బ్రియంబు లాదరము లింపులు నింపఁగఁ జేసినారు స
న్మానము నాకు నిక్కడ నుమారమఖుండు చిరాయురున్నతుల్
మానుగ నిచ్చి ప్రోచుత! సమస్తశుభంబులు గల్గ వారికిన్.

ప్రప్రథమాష్టావధాన సభ. మా భారతీ సాహిత్యసమితి వారు గాయక సమ్మేళనము నిర్వహించి ఈ అవధాన సభ జరిపించిరి. ఆప్తులు, కోరుట్ల పద్మశాలికులోన్నతి సంఘాధ్యక్షులు, సుకవివర్యులు శ్రీ ఎక్కలదేవి లక్ష్మణగారధ్యక్షత వహించిరి. ఆత్మీయులు, 'జ్యోతిష సమ్రాట్' శ్రీ గోనె విఠల్‌గారు ప్రథమ సన్మానము చేసిరి.

# చెన్నూరు

(ఆదిలాబాదు జిల్లా) తేది : 18-7-1976

## చెన్నూరు ప్రశంస :

క. మిన్నయగు శాస్త్రిపాండితి
ప్రన్నని కవితాదికళలు బహువర్తకముల్
చెన్నగుచు మారు మూలన్
మన్నన గను పురముఁ దలఁతు మదిఁ జెన్నూరున్.

## దత్తపది :

కదను, పదను, అదను, చదను - భారతార్థములో.

ధ్రువకోకిల: కదను ద్రొక్కుచు భూమి కంపిలఁ గౌరవేంద్రుని సైన్యముల్
పదను జూపుచు నూపివేయఁగఁ బాండవేయుఁడు రుద్రుఁడై
అదను జూచి ప్రచండతాండవ మాడె భండనభూమిలో,
చదను పల్లము మిట్ట నాకయె శత్రువీరులు పాఱఁగా.

## సద్యోవర్ణన :

గోదావరి తెలుగువారి పెన్నిధి యని వర్ణించుట.

ఉ. దక్షిణగంగ యన్ వరప్రథన్ విలసిల్లెడి గౌతమీనదిన్
దక్షు లెవారు ప్రస్తుతి ఘనంబుగఁ జేసెడివారు ధాత్రిలో
నక్షయమౌ సుధాలహరు లందునఁ దేల్చుచు సస్యసంపదల్
భిక్షలు పెట్టి ప్రోచు మన పెన్నిధి సన్నిధి భాగ్య మద్దిరా!

సమస్య :

ఇల్లాలిన్ దెగటార్చె భానుకులరాజేంద్రుండు యజ్ఞార్థమై.

శా. కల్లోలం బొనరించుచున్ సతము దీక్షాధ్వంసమున్ జేయుచున్
లొల్లిన్ బెట్టుచు రాక్షసాధములు దుర్యోగప్రయోగంబులన్
జెల్లన్ రేఁగఁగఁ, దాఁకెఁ దాటక, మునిశ్రేష్ఠుండు ప్రేరేచె, నా
ఇల్లాలిన్ దెగటార్చె భానుకులరాజేంద్రుండు యజ్ఞార్థమై.

నిషేధాక్షరి :

లయకారియగు శివుని గురించి.

క. శ్రీమచ్ఛంభుఁడు జయతతి
క్షేమం బడరింపఁ బ్రజను జేయును లయమున్
హేమంబు శుద్ధి చేయఁగ
నేమంబుగఁ బుటము పెట్టి నెగడించు క్రియన్.

గురుదేవులు, మహాకవి శిరోమణి 'అభినవ పోతన' శ్రీమద్వాన మామలై వరదాచార్యులవారక్కడి 'సాహిత్య గౌతమి' పక్షాన ఏర్పాటు చేయించిరి. అక్కడి పద్మశాలి సంఘము వారు సన్మానించిరి. సభకు వరదాచార్యుల వారధ్యక్షత వహించిరి. సభామోదముతో శ్రీవరదా చార్యులవారు 'కవిశిరోమణి' అను బిరుదము ప్రసాదించిరి.

# కోరుట్ల

తేది : 25-7-1976

## టీచర్స్ క్లబ్బు మిత్రుల ప్రశంస :

క. టీచర్సు క్లబ్బు మిత్రులు
నేచరుగా సహృదయులయి నేఁడిట నవధా
నాచరణం బొనఁగూర్చిరి
పాచుర్యజయాభ్యుదయము వఱలుత! సతమున్.

## దత్తపది :

ముంగిలి, పొంగలి, మంగలి, వెంగలి-విరాటపర్వ కథార్థమున.

ఉ. ముంగిలి నుండి చూచి ఘనమోహమదాంధతఁ గీచకాఖ్యుఁ డా
పొం గలికంబు పైకిడెడి పొంపిరిఁ గూర్పఁగఁ బాండవేయరా
మం గలియంగఁ బిల్వ వెత మాసిని భర్తను రెచ్చఁగొట్ట నా
వెంగలి రూపు మాపెఁ గడు పీఁకను మారుతి యొంటి రుద్రుఁడై.

## సద్యోవర్ణన :

ప్రథమరాత్రి భర్త నపుంసకుడని తెలిసిన భార్య పరిస్థితి.

ఉ. సుందరి యందమౌ నరుని జూచి మనం బిడి పెండ్లియాడి యా
నందము లజ్జయున్ బెనఁగ నాతి యలల్లనఁ దొల్తిరేయిఁ -ద
న్మందిరశయ్యఁ జేరి పతి మన్మథదండము షండతన్ బడన్
గుంది నెలంతయున్ బడెను ఘోరతమంబునఁ బద్మినీగతిన్.

సమస్య :

అంగాంగంబున లింగలింగరతి ప్రహ్లాదించె నిష్కామతన్.

శా. సంగంబుల్ జలజాతపత్రజల విస్ఫారంబులై చిత్తముల్
గంగాపావనమై త్వదీయపద యుగ్మం బందు రంజిల్లుచున్
భంగం బందక నీదు భక్తతతి శుంభ త్తన్మయత్వంబుగా,
అంగాంగంబున లింగ! లింగ! రతి ప్రహ్లాదించె నిష్కామతన్.

నిషేధాక్షరి :

గురుప్రశంస.

క. జ్ఞాతంబౌ దానన్ శ్రీ
స్ఫీతంబున బుద్ధి నిచ్చి చిత్రగతునిగాఁ
బ్రీతిగ నరు నొనరించెడి
భూతల సురతరువు గురువుఁ బొగడఁగ వశమే?

శుభాకాంక్షలు :

క. టీచరులు నేఁటి సన్మతి
భూచరులే కాక కీర్తి పొల్పున నెంతో
ఖేచరులై విలసిల్లిరి
శ్రీచరులై వెలయ వలయు శ్రీహరి కరుణన్.

కోరుట్ల టీచర్స్ క్లబ్బు వారేర్పాటు చేసిరి. ఆత్మీయులు, సహృదయ విద్వత్కవివర్యులు గాయకులు, నటులు శ్రీ బైరి నరసయ్యగారు ప్రముఖ పాత్ర వహించిరి. స్థానిక సంస్కృత పాఠశాలా ప్రధానాధ్యాపకులు శ్రీ మృత్యుంజయశర్మగారు సభ కధ్యక్షత వహించిరి.

# కోరుట్ల

తేది : 9-8-1976

## కోరుట్ల ప్రశంస :

ఉ. శ్రీలకుఁ దావలం బయి విశిష్టసహృజ్జనతాలవాలమై
లాలితసత్పరిశ్రమకళానిలయం బయి సత్కవీంద్రబృం
గాలకు నందనం బయి జగాన జగా సుయశోవిరాజియై
మే లొనగూర్చు మత్పురము మేటి కోరుట్లను సన్నుతించెదన్.

## దత్తపది :

సంగడి, గొంగడి, అంగడి, పంగిడి - శ్రీ కృష్ణుని గోపాలనము.

ఉ. సంగడికాండ్రతో గిరుల సందుల కృష్ణుఁడు ఆల మేపుచున్
గొంగడి పైన వాల్చి మెయి కొంత విరామము నందు నంతలో,
అంగడి గోల చాల విన నయ్యె నటన్ గనఁగా మడుంగులో
పంగిడి నేన్గులై పసులు వడ్డఁ గృపామతిఁ గాఁచె నందయై.

## సద్యోవర్ణన :

తొడలు విరిగి పడిన దుర్యోధనుని పశ్చాత్తాపము గురించి.

ఉ. అక్కట! పాండవేయుల నహంకృతితోడను ధర్మమూర్తులన్
జిక్కులఁ బెట్టి ఘోరముగఁ జేద్పడఁ జేసితి నట్టి పాపమే
దిక్కులు గాన లేని గతి తెచ్చె నటంచు సుయోధనుండు తాన్
వెక్కయు వెక్కయేడ్చెహతవీర్యుఁ డధైర్యుఁడు జాలిజాలిగాన్.

సమస్య :

పడమటఁ బుట్టి భాస్కరుఁడు పర్వెడెఁ బ్రాగ్దిశ నస్తమించఁగన్.

చ. బుడుతలు కామకేళి కెదఁ బొంగ, వయస్సునవారు సత్వమున్
జెడి పడిపోవఁ బుత్రకులు చేడ్పడి తండ్రుల ధిక్కరించఁగాఁ
గొడుకులఁ గాంచి వారు వణఁకున్ గొనుచుందు
రిదేమి టయ్యయో!
పడమటఁ బుట్టి భాస్కరుఁడు పర్వెడెఁ బ్రాగ్దిశ నస్తమించఁగన్.

నిషేధాక్షరి :

శ్రీ వాసర సరస్వతీదేవి గురించి.

క. శ్రీ లింపొందు విభుతతోఁ
బాలించన్ వెలయు భక్తవర్యతతులు పో
నాలించి వరము లొసఁగును
వేలుపులన్ మేటి వాణి పృథువాసరలోన్.

కోరుట్ల సాహితీమిత్రు లేర్పాటు చేసిరి. ముఖ్యముగా ఆత్మీయులు, ఆప్తులు శ్రీ రేగుంట సాయన్నగారు విశేష కృషి చేసిరి. గురుదేవులు, మహాకవి శిరోమణి అభినవ పోతన శ్రీ మద్వానమామలై వరదాచార్యుల వారు సభకధ్యక్షత వహించిరి. ఆధ్యాత్మిక గురుదేవులు, మహాయోగివరేణ్యులు, 'కుండలినీజ్ఞాన యోగి' అవధూత శ్రీశ్రీశ్రీ గోవిందగిరి స్వాముల వారు ముఖ్యాతిథిగా విచ్చేసి ఆశీర్వదించిరి. శ్రీ వరదాచార్యుల వారు సభాసదుల ఆమోదముతో 'అవధాన యువకేసరి' బిరుదము ప్రదానము చేసిరి. రూ. 1116/- లతో శాలువతో ఘనముగా పౌర సన్మానము జరిగెను.

# జగిత్యాల

(కరీంనగర్ జిల్లా)　　తేది. 12-9-1976

జగిత్యాల ప్రశంస :

ఉ.　శ్రీలలనాస్పదం బయి ప్రసిద్ధకళాప్రభలన్ బ్రపూర్ణమై
మేలగు రాజకీయముల మేదినియై పరమార్థచింతనా
గ్రాలయమై జగా వెలుఁగు లంతటఁ గ్రమ్మెడునట్టి యీ జగి
త్యాలపురమ్ము మండలసమాభవరమ్ము కరమ్ము నెంచెదన్.

## శ్రీ మహమ్మద్ అలిగారి ప్రశంస :

సీ.　ముగ్ధసుకృతు లాణిముత్యాల మమతతో
　　　ఆంధ్రవాగీశ్వరి నలవరించి
నీతినియమములఁ జాతురీప్రియముల
　　　నుద్యోగధర్మంబు నొప్పఁ జేసి
కారుణ్యభావానఁ గష్టనిష్ఠురములఁ
　　　ద్రోఁచి యార్తజనులఁ గాచిప్రోచి
పరమసహృదయతఁ బండితకవికళా
　　　కారుల నిరతంబు గారవించి

గీ.　సుగుణమణిగణసద్యయశశ్శోభ లెసఁగ
రమ్యసహకారవాటికన్ రాణఁ జెలఁగు
మద్హృదయసఖు శ్రీమహమ్మదలిగారి
ప్రణయవాక్సుధాధారలఁ బ్రస్తుతింతు.

## వ్యవసాయాభివృద్ధి బ్యాంకు ప్రశంస :

క. నవధాన్యసంపదలు మా
నవతతి కిడు కర్షకులకు నానాగతులన్
నవనిధు లిడు సహకార
వ్యవసాయప్రగతి బ్యాంకు వర్ధిలుఁ గాకన్!

## దత్తపది :

మానము, గానము, శ్వానము, స్నానము- కుచేలుడు కృష్ణుని వద్దకు పోయినప్పటి విషయము-

ఉ. మానముతో దరిద్రతను మాపఁగ వచ్చిన యాకుచేలునిన్
గానము చేయుచున్న హరి గౌరవ మొప్పఁగ నాదరించి వి
శ్వాన ముదంబు నిండు గతి సన్మతి చేయఁగ నెంచి మంగళ
స్నానము భక్తిఁగూర్చి ఘనసంపదలిచ్చుచు నంపె నర్మిలిన్.

## సద్యోవర్ణన :

లోభి తన ధనమును దొంగ లపహరించగా పొందిన దుస్థితి.

చ. కుడువక బంధుమిత్రులకుఁ గూర్చిన వారికిఁ బెట్ట కెంతయున్
బిడుచను బిల్లి కేయకయుఁ బిచ్చిగఁ గూర్చిన ద్రవ్య
మంతయున్
దుడుకులు దొంగ లయ్యెడల దోఁచుకపోయినఁ జూచి నేలపైఁ
బడి కడు నేడ్చెఁ బొర్లు చూక పాపపు లోభి దురంతవేదనన్.

## సమస్య :

మగవానికి గర్భ మయ్యె మానినిఁ గూడన్.

క. తగురీతి భోగభాగ్యము
లగణితముగ వెలుఁగు రసికుఁ డర్ధాంగిని బొం
దుగఁ గూడఁ దృప్తి యయ్యెను
మగవానికి, గర్భమయ్యె మానినిఁ గూడన్.

నిషేధాక్షరి ;

ఆంజనేయుడు సీతాన్వేషణలో అబ్ధి దాటి లంకకు పోవుట గురించి.

క. మానిసి దిన్ రా పీటన్
గానం జని క్ష్మాజ తా సుఖరతిన్ బడమిన్
దా నెఱిఁగి విభుని కుశలము
మానుగ వివరించె హనుమ మానినికి వనిన్.

జగిత్యాల వ్యవసాయాభివృద్ధి బ్యాంకు వారేర్పాటు చేసిరి. నా అల్లుడు వ్యవసాయాభివృద్ధి బ్యాంకు సూపర్వైజర్ శ్రీ గుంటుక మోహన్ ప్రత్యేక శ్రద్ధ వహించెను. ఆత్మీయులు, సుకవివర్యులు సహకార డిప్యూటి రిజిస్ట్రారు శ్రీ మహమ్మద్ అలిగారు సభ కధ్యక్షత వహించిరి. ఘనముగా సన్మానించిరి.

# ధర్మారవుం

(నిజామాబాదు జిల్లా)  తేది : 26-9-197

ధర్మారము ప్రశంస :

ఉ. పాఁడికిఁ బంటలక్ష్మికినిఁ బచ్చదనాలకు నాలవాలమై
వాఁడిగ వేఁడిగాఁ జెలఁగు వైభవశోభితరాజనీతికిన్
వీడయి ప్రస్తుతాభ్యుదయ విస్తృతకార్యకలాపసీమయై
నాఁడును నేఁడునున్ గలిసి నర్తిలు ధర్మవరంబు నెంచెదన్.

దత్తపది :

ధర్మము, కర్మము, మర్మము, చర్మము - విభీషణుడు రావణ
నికి హితవు చెప్పుట గురించి.

ఉ ధర్మముఁ దప్పి సీతఁ బరదారను దెచ్చితి వేమిటయ్య యీ
కర్మము పాపదూషితము కాంతను రాముని కిచ్చి మ్రొక్కుమా
మర్మము గానవే పనుల మాదృశు లేమని చెప్ప, దేహమున్
చర్మముఁ దీసి నిల్పు టెటు? సాధ్యమె భద్రత పాడి వీడినన్?

సద్యోవర్ణన :

వేడి వాతావరణ మున్నను శ్రోతలు ఓపికగా కూర్చుండి విను
చున్నందుకు ప్రశంసించుట.

ఉ. వేసవి యెండలో యనఁగ వెక్కసమై కడు తాపపెట్టుచున్
వేసట గూర్చినన్ మదిని వేదన జెందక శాంతచిత్తులై
యీ సభ నోర్పుతో వినుచు నెంతయు సంతసమందు శ్రోతలన్
భాసుర చిత్తులన్ మిగులఁ బ్రస్తుతి చేతుఁ గృతజ్ఞతామతిన్.

సమస్య :

లంకేశుఁడు రాముఁజంపె లలనేచ్ఛమెయిన్.

క. పంకజముఖి నెవఁ డీడ్చెను?
కొంకక హనుమంతుఁ డెవరిఁ గొల్చెను? సుందుం
డింక హితు నేమి చేసెను?
లంకేశుఁడు, రాముఁ, జంపె లలనేచ్ఛ మెయిన్.

నిషేధాక్షరి :

ధర్మారము ఆదర్శ గ్రామమని వర్ణించుట.

క. శ్రీధీభూసంపత్సం
శోధక హృద్ధమ్య పూజ్య శోకాపహృదుత్
సాధిత ఘన కార్యంబుల
తో ధర్మవరము పురముల దొరయై వెలసెన్.

ఆత్మీయులు సహృదయ విద్వత్కవివర్యులు శ్రీ రాగి చిన్నయ్య తెలుగు పండితులుగా రేర్పాటు చేయించిరి.

# నిర్మల

(ఆదిలాబాదు జిల్లా) తేది. 8-10-1976

నిర్మల ప్రశంస :

క. శర్మలతో వర్మలతో
ధర్మలసద్వర్తకులను వరధర్మోద్య
త్కర్మలతో విలసిల్లెడి
నిర్మలపురవరము నెంతు స్నిగ్ధమనమునన్.

క. నీతులకున్ జెలరేఁగెడి
కోఁతులకున్ జగము మెచ్చుకొను బొమ్మల మేల్
జాతులకును సత్కవితా
రీతులకును బేరయిన పురినిర్మల తాన్.

దత్తపది :

నమస్కారము, పురస్కారము, తిరస్కారము, సీత్కారము. భారతార్థములో.

ఉ. భారతవీరు లంప యదువంశ్యుఁడు సంధికి వచ్చినన్ నమ
స్కారము చేసె భీష్ముఁ,డుపకారము నెంచెను ద్రోణుఁడున్,పుర
స్కారము నాంబికేయుఁ డట సల్పెను, మెచ్చక దుష్టుఁడై తిర
స్కారము రాజరా జపుడు చాలఁగఁ జేసెను, కౌరవాళి సీ
త్కారముచేసె, సంధి చెడి దారుణయుద్ధము రేఁగె వారికిన్.

## సద్యోవర్ణన :

సభాసదులు అవధానము విని చెవి కోసుకొందురా? చీదరించు కొందురా? వర్ణించుట.

ఉ. ప్రీతిగఁ జెప్ప వింత యనిపించెడి నా యవధానసత్కళన్
శ్రోతలు మెచ్చి శాంతముగఁ జొక్కుచు విందురుకాని యేగతిన్
రోఁతను జెందఁగాఁ గలరు? రోజ సుగంధము మెచ్చకుందురే?
చేతములన్ రసజ్ఞత విశిష్టముగాఁ గల మీకు మ్రొక్కెదన్.

## సమస్య :

పవలన్ మేఘవృతాంతరిక్షమున సంభాసిల్లెఁ దారావళుల్.

మ. దివిలో నింద్రసభావిభాస మన సందీపించు చిత్రమ్మునన్
నవరంభాకృతిఁ బోల్చు భామినులు విన్నాణంబుగా నృత్యముల్
సవరింపంగను క్లబ్బులో నిరుల నాశ్చర్యం బహో! కల్గెడిన్
పవలన్ మేఘవృతాంతరిక్షమున సంభాసిల్లెఁ దారావళుల్.

## నిషేధాక్షరి :

నిర్మలలో స్థాపించబడిన భారతీ కళానికేతనము గురించి.

క. శ్రీవాగ్ హృన్మత్కళనన్
సేవా సంపద్విభాస శ్రీదీభూసం
భావన ప్రజల కొనర్పఁగ
నీ విధి భారతి సుసంస్థ యేర్పడె నిచటన్.

స్థానిక భారతీ కళానికేతనము వారేర్పాటు చేసిరి సంస్థ వ్యవస్థాపకులు ఆత్మీయులు, సహృదయ కవివరేణ్యులు శ్రీ తిరుక్కోవెల లక్ష్మీనరసింహస్వామిగారు, కవిపండితలలాములు శ్రీ సి.వి. జయవీర రాజుగారు ప్రధాన పాత్ర వహించిరి.

# ఐలాపురము

(కరీంనగర్ జిల్లా)      తేది : 9-10-1976

ఐలాపురము ప్రశంస :

క. నెయ్యములకుఁ, జెడు గూల్చెడు
కయ్యములకుఁ, బ్రగతికార్యకల్యాణముతో
వియ్యములకు నుతి కెక్కిన
అయ్యలపురమును దలంతు ననురాగమునన్.

క. నేఁతలకును సుఖపెట్టెడి
గీఁతలకును భాగ్యరాశి కెఱలు పయిరు మేల్
కోఁతలకును బేరొందిన
పూతగుణవరమును నైలపురము నుతింతున్.

దత్తపది :

రాజ్యము, భోజ్యము, త్యాజ్యము, వ్యాజ్యము - 20 సూత్రాల అమలులో కలిగిన ప్రయోజనముల గురించి.

ఉ. రాజ్యము ద్రోహిమండలి నరాజకమై చెడిపోవఁ జూచి మేల్
భోజ్యము సంపదల్ ప్రజకు పొందని ఇర్వది సూత్రముల్ తగన్
త్యాజ్యములౌ నకార్యములఁ దప్పని చెప్పి ప్రజాళి నేల నే
వ్యాజ్యము లేక దేశము శుభంబుల నందుచునుండె నెంతయున్.

సద్యోవర్ణన :

కుటుంబ నియంత్రణ చేయించుడని ప్రభుత్వము ఒత్తిడి చేయగా కలిగెడు ఉద్యోగుల దురవస్థ.

ఉ. ఒత్తిడి చేయు నీ ప్రభుత యొక్కఁడు ముందుకు రాఁడు బొత్తిగా
నెత్తులు లేవు, ప్రాణముల నెత్తురు లే దిఁక నాకు నయ్యయో!
కత్తెరలోని పోఁక బ్రతు కయ్యెను, నాయకు లింద రుండియున్
వత్తురె? రారు, మెత్తనగు వారిని మొత్తుదు రేమి న్యాయమో!

సమస్య :

దేహవిహీనయై భరతదేశము నేలెడి నిందిరమ్మ తాన్.

ఉ. ద్రోహము దాహమున్ జెలఁగ దుష్టులు రేఁగి వినాశకారులై
సాహసముల్ పొనర్ప నవి సహ్యము కాక ప్రచండచండియై
యాహవతుల్యమౌ పథక మల్లి ప్రజావళి మేలుగాంచ సం
దేహవిహీనయై భరతదేశము నేలెడి నిందిరమ్మ తాన్.

**నిషేధాక్షరి :**

గుహుడు శ్రీరామునితో అన్న మాటలు.

క. శ్రీపత్కంభూయుగ్మం
బో పూజ్యా! మున్ను నీట నొప్పన నాకున్
బ్రాపయి కడిగిన మీఁదట
నేపుగ నీ పడవ యెక్కి యేగు మహాత్మా!
శ్రీ=శుభకరమైన; పత్+కంభూయుగ్మంబు = పాదపద్మముల జత.

పూర్వ విద్యార్థి సహృదయవరేణ్యుడు ప్రియమైన శ్రీ కల్లెడ సోమయ్య ఏర్పాటు చేయించెను. స్థానికులైన పెద్దలు, మిత్రులు నిర్వహించిరి.

# అరుగుల

(నిజామాబాదు జిల్లా)    తేది : 21-11-1970

**అరుగుల ప్రశంస :**

క.	వెరుగులతో, నవధాన్యపు
టరుగులతో, అభ్యుదయ మహాకృషి కొలకౌ
పరుగులతో విలసిల్లెడి
అరుగుల పురవరము నెంతు నానందముగన్.

**దత్తపది :**

కాఁపురము, గోపురము, నూపురము, మూఁపురము - ఈ పదములతో హరిశ్చంద్రోపాఖ్యానము గురించి.

ఉ.	కాఁపురమున్ యథాయథలుగా విధి చేసినఁగాని జంకకన్
గోపురమున్ హసించు తళుకుల్ గల కాశినిఁ గాటికాపరై
నూపుర ముఖ్యభూషలు తనూలత వీడిన దీనవేషుఁడై
మూఁపురమున్ నతంబుగను భూపతి కొల్చెను సత్యకామియై.

**సభ్యవర్ణన :**

బాలురు నిలబడియు అవధానము వినుట గురించి.

మ.కో. కంటకంబులు గ్రుచ్చుచున్నను గౌతుకాన గులాబులన్
గంటగింపక కోయు స్త్రీతతి కైవడిన్ మన బాలకుల్
మింటి నంటెడు నుత్సుకత్వము మీఱ నీ సభఁ జూడగఁన్
గెంటుచున్ జనుదెంచి నిల్చిరి కీర్తనీయులు బాపురే!

సమస్య :

పతి కొడుకున్ బతిని జంప భామిని యేడ్చెన్.

క. అతిఘోరం బగు యుద్ధము
వితతకురుక్షేత్ర మందుఁ బెల్లదరన్ బ్రో
ద్ధతి నరసుతుఁ డనిలజభూ
పతి కొడుకును బతిని జంప భామిని యేడ్చెన్.

తా॥ కురుక్షేత్ర యుద్ధములో తన కొడుకైన లక్ష్మణుని అభిమన్యుడు, భర్తను భీముడు వధించగా దుర్యోధనుని భార్య భానుమతి శోకించెను.

నిషేధాక్షరి :

శూర్పణఖ రాముని వలచుట గురించి.

క. శ్రీలన్ రాణింపన్, బెన్
స్త్రీలన్ గారించు చెల్వు తీవ్రగమకహృద్
వ్యాలోలశూర్పణఖ కని
తాళక రఘురాముఁ గూడఁ దా నుంకించెన్.

తా॥ శోభల చేత వెలుగొందుచు స్త్రీలకు మన్మథపీడ కలిగించు సౌందర్యము రామునిలో చూచి శూర్పణఖ నిలువలేక అతనిని పొందుటకు ప్రయత్నించెను.

ఆత్మీయులు, సుకవివర్యులు, అరుగుల ఉన్నత పాఠశాల హిందీ పండితులు శ్రీ వొటారికారి చిన్న రాజన్నగారు చేయించిరి. సభకు ఆర్మూరు ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ దేశికాచార్యులు గారధ్యక్షత వహించిరి.

# హైదరాబాదు

(శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము) 9-1-1971

## హైదరాబాదు ప్రశంస :

శా. మాదన్నాదుల బుద్ధిచాతురి జగన్మాన్యంబుగాఁ బండితా
మోదోద్యత్కవితాకళాప్రభలతో భూభృత్ప్రజాపాలనన్
బ్రోదిన్ గాంచి సమస్తభారతమునన్ బొంపైన యీ హైదరా
బాదున్ భిన్నమతోరుసంస్కృతులకున్ బాదున్
ప్రశంసించెదన్.

## శ్రీ కేశవపంతుల వారి ప్రశంస :

ఉ. మందుల నైనఁ బ్రాజ్ఞులుగ మార్చు ప్రబోధ మఖండపాండితీ
సుందరశైలి సౌహృదము శోభిలు వర్తనముల్ రసజ్ఞతో
క్తిం దులకించు బాష గల కేశవపంతుల వంశవార్ధిరా
కేందు నృసింహశాస్త్రిల నుతింతు నెదన్ గడు భక్తియుక్తితోన్.

## హైదరాబాదులో అవధానము గురించి :

ఆ.వె. జనపదాల వెంట సాగిన అవధాన
శకట మిచట నెటుల సాగఁ గలదొ
ఇది మహానగరము పదిలము, సమ్మర్ద
మెంతొ వంతగూర్చు స్వాంతమునకు.

దత్తపది :

రాజులు, మోజులు, వాజులు, రోజులు - 20 సూత్రాలలో వెట్టి చాకిరి నిర్మూలన గురించి.

ఉ. రాజుల వోలె పేదలను రాయిడి పెట్టుచు స్వర్గభోగపున్
మోజుల దేల దాస్యమున మూల్గెడు దీనజనావళినేల బల్
వాజులఁ బోలు ప్రజ్ఞలను బర్వగఁ జేసి ప్రధాని స్వర్ణపున్
రోజులు దెచ్చె, భాగ్యముల ప్రొద్దుదయించెను వారి వాకిటన్.

## సద్యోవర్ణన :

అవధానవైభవము గురించి.

ఉ. ప్రాజ్ఞులు కంటకంబు లనఁ బైకొని బుద్ధిని నొంచుచుండఁగాఁ
బ్రజ్ఞను జక్కఁగా నడపి భావరసాంచితపద్యరత్నముల్
విజ్ఞులు మెచ్చఁ జెప్పుచు బళీ! యన నద్భుతసాగరంబునన్
యజ్ఞసమావధానమున నాడఁగఁ జేయుట యేరికశక్యమౌ?

## సమస్య :

నందనఁ బెండ్లియాడె నరనాథుఁడు మిక్కిలి మోహచిత్తుఁడై.

ఉ. పొందుగఁ దీర్థయాత్రలకుఁ బోయి యనేకనదీనదంబులన్
మందిరదేవతాతతుల మానుగఁ గొల్చుచు ద్వారకన్ పృథా
నందనుఁ డొయ్య జేరి మునినాథుని వేషముఁ దాల్చి రోహిణీ
నందనఁ బెండ్లియాడె నరనాథుఁడు మిక్కిలి మోహచిత్తుఁడై.
పృథానందనుడు=అర్జునుడు; రోహిణీనందనన్=సుభద్రను.

## నిషేధాక్షరి :

కుటుంబ నియంత్రణ గురించి.

క. శ్రీదీభూసంపత్ సం
బాధకదుష్ప్రజల సేన బడఁతుల్ హృన్మద్
వేధముగఁ గాంచ నేటికి?
సాధించుఁడు శాంతిని మితసంతానముతో.

డా॥ అందె వేంకటరాజము

దుష్ప్రజలన్ = చెడ్డ సంతానమును; సేన = మిక్కిలి; హృత్ + ముత్ + వేధముగన్ = హృదయానందమునకు భంగముగా.

ఆత్మీయులు సుకవివర్యులు శ్రీ నిమ్మల అర్జున గౌడుగా రేర్పాటు చేసిరి. 'శిరోమణి' శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు సభకధ్యక్షత వహించిరి. శాసన సభ్యులు శ్రీ రంగదాసుగారు ముఖ్యాతిథిగా విచ్చేసిరి. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు, డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు మున్నగువారు పృచ్ఛకులుగా వ్యవహరించిరి.

# జగిత్యాల

తేది : 28-1-1977

## శ్రీ మార్కండేయ స్తుతి :

శా. అల్పాయుస్సునుమామహేశకృప బ్రహ్మాయుస్సుగాఁ గాంచి పల్
కల్పాంతంబులు చూచి నిస్తులతపఃకల్పంబులన్ శాశ్వతా
నల్పజ్ఞానఫలంబు లిచ్చి విమలోద్యత్ పద్మశాలి ప్రజా
కల్పశ్రీపితయై చెలంగు వరమార్కండేయుఁ జింతించెదన్.

## దత్తపది :

మనము, ధనము, ఘనము, దినము- భావన మహర్షి పద్మ తంతువులతో వస్త్రమునేసి శ్రీ విష్ణువునకు సమర్పించగా ఆ దేవుడిచ్చిన ఆశీస్సుల గురించి.

చ. మనము కృపాప్రపూర్ణ మయి మాధవుఁ డిట్లనె నోయి భావనా!
ధనముల కెల్ల మాన మిల దండిది, దానిని నిల్పఁ దంతువుల్
ఘనముగ నేసి వస్త్రమును గానుక పెట్టితి వీవు భాగ్య మీ
దినము, త్వదీయవంశ మతి తేజముఁ గాంచుత! పద్మశాలియై.

## సద్యోవర్ణన :

సుస్నాతుడైన భక్తుఁడు శ్రీ మార్కండేయస్వామి దేవాలయ మును దర్శించుటను గురించి.

శా. పూతస్నాన మొనర్చి భక్తుఁ డెలమిన్ బొంగారు చిత్తమ్ముతోఁ
ప్రాతఃకాలము వచ్చి చూచి ఘనమార్కండేయ దేవాలయం
బా తీరున్ రమణీయశిల్పము మనోజ్ఞాలంకృతిన్ మెచ్చుచున్
బ్రీతిన్ జేసెఁ బ్రదక్షిణప్రణతులన్ బెంపారు భక్తిన్ గడున్.

సమస్య :

అమృతకరుఁడు పెంపు గాంచె నమవసవేళన్.

క. ప్రమదస్వప్నజగంబునఁ
బ్రమదామణి చూచె రాత్రి భాస్కరగ్రహణం
బమరఁగఁ బున్నమ, నప్పుడె
యమృతకరుఁడు పెంపు గాంచె నమవసవేళన్.

**నిషేధాక్షరి :**

గాయత్రీ విశిష్టత.

క. శ్రీదమ్మై పాపవిపద్
భేదకభాదీప్రపూతవిద్యుత్ప్రభాత్సన
మ్మోదకమై మోక్షప్రద
మై దయ గాయత్రి ప్రోచు నతిశ్రేష్ఠంబై.

జగిత్యాల పద్మశాలి సంఘమువారు శ్రీ మార్కండేయ విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవ సందర్భమున ఏర్పాటు చేసిరి. ఆత్మీయులు, సుప్రసిద్ధ కళాకారులు శ్రీ అలిశెట్టి మహారాజుగారు, శ్రీ బొద్దున గంగారాముగారు, శ్రీ నడిమెట్ల జనార్దన్‌గారు మొదలగువారు సహకరించిరి. సభకు గురువర్యులు, రిటైర్డ్ హెడ్మాస్టరు శ్రీ గుండేటి రాజనరసయ్యగారధ్యక్షత వహించిరి.

# నిజామాబాదు

తేది: 15-2-1977

ప్రిన్సిపాల్, సఖాధ్యక్షులు

శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు గారి స్తుతి :

చ. కళలఁ బదాఱు వన్నె లొలుకన్ జెలువొందు
ముఖేందుబింబమున్
గళల సుధారసాల సుమనస్సులఁ దేల్చు వరాంతరంగమున్
కలల భువిన్ దివిన్ సలుపు కాంక్షలు రాజిలు పూర్ణచంద్రరా
యల నవరాయలన్ దలఁతు హార్దికరాగనమస్సుమావళిన్.

గిరిరాజ కళాశాలా విద్యార్థుల స్తుతి :

ఉ. ఆటలు పాటలున్ వదలి యందము చందము చిందు పౌరరా
ట్కోటికిఁ బోటికిన్ నిలువఁ గొండల గుండులపైకి ముళ్లలున్
మూటలతోడనెక్కుగతి భూరికళల్ జటిలంపు శాస్త్రముల్
ధాటిగ నేర్చు ఛాత్రుల నుదాత్తచరిత్రుల నెంతు మిమ్ములన్.

దత్తపది :

దొసఁగు, ఒసఁగు, పొసఁగు, ముసుఁగు-ఎన్నికలలో ఓడిపోయిన రాజకీయ నాయకుని మానసిక స్థితి.

చ. దొసఁగుల నెన్ని చేసితినొ దుందుడు కొప్పఁగ నీ పరాజయం
బొసఁగుఁ బ్రజాళి, దైవము మహోగ్రగతిన్ నను గూల్చె
నయ్యయో
పొసఁగునొ యింక శ్రేయములు ముందగు దేమిటొ మోము
చెల్లకే
ముసుఁగున దాఁగియుండు నని పోయిన యెన్నిక కేడ్చె నేత
తాన్.

సద్యోవర్ణన :

అర్ధ రాత్రి ప్రియురాలిని సంకేత స్థలముతో కలియబోగా పోలీసులు పట్టుకొని టౌన్‌లో వేయగా వాడు చింతించిన విషయము.

ఉ. ఆమని నర్ధరాత్రిఁ బ్రియురాలిని దోఁటలఁ జేరఁ బోవఁగా
నేమనఁ దీర్ఘమాడ మొసలెత్తుకపోయిన యట్టి చందమై
భీమునివంటి కాన్స్టెబులు బిట్టుగఁ బట్టుక పెట్టె నీచెఱన్
బ్రేమకు శిక్ష యిట్టిదొకొ! ప్రేయసి నన్నన కెంత కుందునో!

సమస్య :

మార్జాలం బట సింహ మయ్యె నవురా మర్మంబు వాక్రువ్వవే.

శా. దుర్జాతుండుగ సైంధవుండు వనిలో దుష్టాత్ముఁడై ద్రౌపదిన్
గర్జింపంగను ధౌమ్యుఁడున్, బలిమి లాగన్ బట్టి శిక్షాత్ముఁడై
దుర్జేయానిలసంభవాదుల ననిన్ దుర్వారుఁడై యొడ్డె హా!
మార్జాలం బట సింహమయ్యె నవురా మర్మంబు వాక్రువ్వవే.

నిషేధాక్షరి :

పంచవటిలో సీతారాముల జీవనము.

క. కాననఁ గుజరాడ్భూకుటిఁ
జాననఁ బ్రేమాబ్ధిఁ దేల్చ సమ్యగ్లీనా
నూన విహారుండై ర
క్షోనిహతిన్ రామమూర్తి కూర్చె నభయమున్.

నిజామాబాదులో ప్రభుత్వ గిరిరాజ్ కళాశాలలో జరిగినది. సభకు ప్రిన్సిపాల్ శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావుగారు అధ్యక్షత వహించిరి. ఆత్మీయులు, సుకవివర్యులు శ్రీ రాగి చిన్నయ్యగారి ప్రేరణతో కళాశాల ఆంధ్రోపన్యాకులు మిత్రులు శ్రీ శిరిసినహళ్ వేంకటాచార్యులుగారి సహకారంతో ప్రిన్సిపాల్‌గా రేర్పాటు చేసిరి.

# సిరిసిల్ల

(కరీంనగర్ జిల్లా)  తేది. 27-2-1977

## సిరిసిల్ల ప్రశంస :

శా. చాలా భంగుల రంగులన్ దనరు వస్త్రవ్రాతపున్ నేఁతలున్
బాలింపం దగు నేతలున్ శ్రమలయన్నల్ కార్మికుల్ ధార్మికుల్
సోలం బిచ్చు కవుల్ చెలంగ బళిరా! షోలాపురంబైన శ్రీ
శాలన్ మాతృత్రయీకరుణశ్రీశాలన్ నుతింతున్ మదిన్.

## దత్తపది :

అందము, సుందరి, పొందును, పొందెను-రామాయణార్థములో.

ఉ. అందము సౌకుమార్యమును నచ్చపు శీలము వెల్గు జానకిన్
సుందరిఁ గాంక్షచేసి ఘనశూరుఁడు రావణుఁ డుంచి తోటఁలో,
పొందును గోరి రామపతి భూరిశరాగ్నులఁ గాలి మూర్ఖుఁడై
పొందెను దుష్టమౌ ప్రథను బొందెను సర్వకులప్రనాశమున్.

## సద్యోవర్ణన :

ప్రస్తుత రాజకీయ సంరంభము గురించి.

శా. దేశ మ్మేలఁ బ్రజాళిఁ బ్రోవ మదిలోఁ దీవ్రంబుగాఁ బూని సం
దేశా లిచ్చుచు నేత లోట్లకయి శక్తిన్ ద్రవ్య మందీయ నా
వేశమ్మో జననష్టమో యని జనుల్ విభ్రాంతులై పల్కినన్
లేశ మ్మొందక కోపతాపములు పార్టీల్ మూఁడు జృంభించెడిన్.

సమస్య :

చెలువుగ రామరావణులు సీతకుఁ దమ్ములు భీముఁడన్నయున్.

చ. చెలఁగి వెలంది కోసమయి చేసిరి యుద్ధ మెవారు? రాముఁడే
లలనకు భర్త?, ఆ కవ లిలన్ మన పార్థున కేమి యౌదు? ర
మ్ములల బకుఁ జంపె నెవ్వఁడట?, ముద్దియ లచ్చికిఁ జంద్రుఁ
డేమగున్!
చెలువుగ రామరావణులు సీతకుఁ దమ్ములు భీముఁ డన్నయున్.

నిషేధాక్షరి :

సత్కవిత గురించి.

క. శ్రీరామావాగ్భూభృ
జ్జారంగద్భారసమ్ము సమ్యక్హృన్మ
ద్ధారకమై సహితంబై
ధారుణి సత్కవిత సతము తనరెడుఁ గాకన్!

ప్రియమిత్రులు, సహృదయ విద్వత్కవివర్యులు శ్రీ వడ్డేపల్లి కృష్ణగారు తమ సాహిత్య సంస్థ యువసాహితీసమితి పక్షాన ఏర్పాటు చేసిరి. స్థానిక పద్మశాలి సంఘము పక్షాన మాన్యులు, సరసోదార హృదయులు, సిరిసిల్ల సర్పంచ శ్రీ రుద్ర శంకరయ్యగారు సన్మానించిరి. సభకు మాన్యులు, సహృదయ విద్వత్కవివరేణ్యులు, ఉపన్యాసకేసరి శ్రీమాన్ ఆచి నరసింహాచార్యులుగా రధ్యక్షత వహించిరి. పూజ్య గురువర్యులు, మహా కవిశిరోమణి, 'అభినవ పోతన' శ్రీమాన్ వాన మామలై వరదాచార్యులవారు ముఖ్యాతిథిగా పాల్గొనిరి.

# పెద్దపల్లి

(కరీంనగర్ జిల్లా)　　తేది : 17-4-1977

## పెద్దపల్లి ప్రశంస :

మ.కో. పెద్ద దెంతయు సంస్కృతిన్ గడు పెద్ద దిద్దపు విద్యలన్,
పెద్దనాదులఁ బోలు ప్రాజ్ఞకవిప్రకాండులఁ బెద్దదౌ,
పెద్ద దెంతయు సత్కళావళిఁ బెద్ద దున్నతి చేష్టలన్;
పెద్దదై సుగుణాల వెల్గెడు పెద్దపల్లి నుతించెదన్.

## దత్తపది :

రండ, ముండ, బండ, పండ - రామాయణార్థములో.

ఉ. రండని పిల్చి రాఘవుఁడు రాక్షసవీరులఁ గూల్చఁ దత్సతీ
ముండన మయ్యె, లోకము ప్రమోదము నొందెను, దేవతాళికిన్
బండఁగ భాగ్యసస్యములు భవ్యముగా మునివృత్తి సాగె, మేల్
పం డతిహర్షమై కొనెను భక్తసమూహము శోభనమ్ములన్.

## సద్యోవర్ణన :

కవితాకన్యను గురించి.

చ. మృదుతరశయ్య లొప్పెసఁగ మిక్కిలి మోదము గూర్చి సొంపుగాఁ
బదముల నల్లనన్ నిలిపి బంధురభావవిలాస లీలలన్
సదమలవృత్తి చిత్తముఁ బ్రసన్నముగాఁ గరఁగించి నిత్యమున్
మదగజయాన కావ్యసతి మంజులయై తనుపున్ రసజ్ఞునిన్.

**సమస్య :**

ముండన్ జేరినఁ బుణ్య మబ్బు నరుఁడా! మోక్షంబునున్
గల్గెడున్

శా. చండాచారములన్ బ్రజోత్కరము హింసాధ్వంసముల్ చేసినన్
రండన్ ముండను జేరి ఘోరముగ దుర్వారక్రియల్ సల్పినన్
గండంబుల్ పయికొన్న సంకటములున్ గాల్ద్రవ్వినన్
భక్తిఁ జా
ముండన్ జేరినఁ బుణ్య మబ్బు నరుఁడా! మోక్షంబునున్
గల్గెడున్

**నిషేధాక్షరి :**

పద్యము లభ్యము కాలేదు.

మిత్రులు, సుకవివర్యులు శ్రీ వాసాల నరసయ్య- పోస్టుమాస్టర గారి ప్రోత్సాహముతో మిత్రులు, ఉత్తమ రచయితలు, అధ్యాపకుల శ్రీ ఆర్. బాలప్రసాద్‌గారు కార్యక్రమ మేర్పాటు చేసిరి. సభక విద్వత్కవివరేణ్యులు శ్రీ గణపల్లి సత్యనారాయణరాజు గారధ్యక్షత వహించిరి. కరీంనగర్ జిల్లా పద్మశాలి సంఘాధ్యక్షులు, స్థానిక సర్పంచు, ప్రముఖ వ్యాపారులు శ్రీ వేముల రమణయ్యగారు సహక రించిరి. మిత్రులు శ్రీ రుద్ర రాజేశము- ఇంజనీయర్‌గారు తోడ్పడిరి.

# మంథెన

(కరీంనగర్ జిల్లా)      తేది: 18-4-1977

## మంథెన ప్రశంస :

ఉ. విప్రుల కాలవాల మయి విశ్రుతదివ్యచరిత్ర కిక్కయై
యప్రతిమానవిద్యలకు నాకరమై సుయశోవిరాజియై
క్షిప్రముఁదావి సత్కళలఁ గ్రమతరం బయి గౌతమీతటిన్
సుప్రభలన్ బవిత్ర మయి శోభిలు మంత్రపురిన్ నుతించెదన్.

## దత్తపది :

హయము, రయము, చయము, జయము - రామాయణ భారతార్థములలో.

చ. హయముల దాటిఁ బోలిన పరాక్రమ మొప్పఁగ రాక్షసావళిన్
రయమునఁ ద్రుంచి రాజిలిన రామునిబం టనిలప్రసూతి యేఁ
చ యమునిఁ గాంచు చందమున జంకెడు భీమునిఁ జూచి నవ్వి మీ
జయమును గోరి నిల్చెదఁ బ్రశస్తపతాక నటంచుఁ బల్కెతాన్.

## సద్యోవర్ణన :

వసంత శోభను గురించి.

ఉ. ప్రాఁతలు వడ్డ భావములు ప్రక్కకుఁ బెట్టి వినూత్నపద్ధతుల్
చేతము లుల్లసిల్లగను జేకొను చందమునన్ వనిన్ గుజ
వ్రాతము నవ్యశోభలను భాసిల నామని యందుఁ బొంగి మేల్
కూఁతలు పెట్టెఁ బక్షితతి కోర్కెలు తీరిన మానవ క్రియన్.

సమస్య :

లోఁజూపున్ వెలిచూపుఁ గావలె నటే లోలాక్షి! నీ విద్యకున్.

శా. మోజుల్ హెచ్చెడు తేజు లొప్పఁగ మహామోహాంధకారంబునన్
రాజాదుల్ పడ వింతవింతగతులన్ రమ్యంబుగా నృత్యముల్
రోజున్ జేసెద వెల్లలోకులఁ గడున్ లోఁగొందు వాశ్చర్యమా
లోఁజూపున్ వెలిచూపుఁ గావలె నటే లోలాక్షి! నీ విద్యకున్.

నిషేధాక్షరి :

హంస రాయబారము గురించి.

క. శ్రీరంగధ్వని రాసుతఁ
జేరం బోవంగ నందచేష్టన్ బట్టన్
వారించి యంచ చని నల
భూరమణుని తోడఁ బ్రేమ పొందించెఁ దగన్.
శ్రీరంగత్ + వనిన్ = శోభలు విలసిల్లు వనములో.

నా పూర్వ విద్యార్థి ప్రియమైన శ్రీ జమంజ్యోతి గంగారాము. పోస్టుమాస్టరు కార్యక్రమ మేర్పాటు చేసి, ఘనసన్మానము కావించెను. సభకు శ్రీ సత్యనారాయణ - అడ్వొకేటుగారు అధ్యక్షత వహించిరి. మిత్రులు, సహృదయ విద్వత్కవివరేణ్యులు శ్రీ గిట్ల జనార్దన్ రెడ్డి గారు ముఖ్యాతిథిగా పాల్గొని ప్రసంగించిరి.

# తక్కళ్ళపలి

(కరీంనగర్ జిల్లా)　　　తేదీ. 3-6-1977

**తక్కళ్ళపల్లి ప్రశంస :**

క.　పౌరుషపరాక్రమములకు
సారతరం బైన సస్యసంపదకున్ బల్
దారులకు రాజనీతికిఁ
బేరగు తక్కళ్ళపల్లి వినుతి యొనర్తున్.

క.　సేద్యమునకు వాద్యమునకుఁ
బద్యమునకు మద్యమునకుఁ బరికీర్తితమై
విద్యుత్తు లేక యయయో
హృద్యత లేకుండఁ బోయె నీ పల్లియకున్.

**దత్తపది :**

అన్నము, సున్నము, జన్నము, సన్నము - భార్య తన భర్తను బంధించి విధేయునిగా జేసికొని పశ్చాత్తాపపడు విషయము.

ఉ.　అన్నము వండఁ జేసితి నహంకృతితోఁ బతి రోసి, నెత్తికిన్
సున్నము పెట్టి కష్టములఁ జొన్పితి నయ్యయొ పాపి నైతి నే
జన్నమునన్ విశుద్ధ నయి సాగుదునో యనురాగ చిత్త మా
సన్నముగాఁ బ్రసన్నముగ స్వామి ననున్ గను టెప్పుడో కదా!

**సద్యోవర్ణనము :**

విత్తనాలు మొలకెత్తెడి సమయములో వర్షాభావమైనచో రైతుల స్థితి గురించి.

ఉ. ఇంటఁ జెలంగు విత్తనము లెంతయు మెత్తఁగ దున్ని రక్తితో
మంటిని బోసి వృష్టికయి మాటికి మింటిని జూచి వేచినన్
గంటికి నీరె కాని యిఁకఁ గన్పడ దింతయు నీరు నింగిలోఁ
బంటలు లేక మంటలకు బగ్గున మండును జీవితా లయో!

సమస్య :

పున్నమరేయి భాస్కరుఁడు పొల్చె మహోతపదీప్తిమంతుఁడై.

ఉ. వన్నెలు చిన్నెలున్ హొయలు బంధురమైన విలాసినీమణిన్
గ్రొన్నన లొప్పు తోటఁలను గూడి యథేచ్ఛవిహారలీలలన్
బన్నుగఁ దేలి తేలి కొద బాయఁ బరుండ గతించె నందమౌ
పున్నమరేయి, భాస్కరుఁడు పొల్చె మహోతపదీప్తిమంతుఁడై.

నిషేధాక్షరి :

స్వయంవరానంతరము సీతను మొదట శ్రీరాముడు చూచినప్పటి అనుభూతి:

క. శ్రీభూజ ప్రేమనోజ్ఞము
గా భాస్వత్ ప్రేయ ఉత్థకాంక్షన్ గాంచం
గా భానువంశతిలకుఁడు
శోభాయుత ప్రేమవీచిఁ జూచెన్ సీతన్.

ప్రియమిత్రులు, సహృదయ విద్వత్కవివర్యులు, పురోహితులు శ్రీ తత్త్వాదికృష్ణశర్మగా రేర్పాటు చేసిరి. ప్రముఖ నాయకులు శ్రీ మిరియాల కిషన్‌రావుగారు సభ కధ్యక్షత వహించిరి.

# మేడిపల్లి

(మండల కేంద్రము, కరీంనగర్ జిల్లా) తేది : 5-6-1977

**మేడిపల్లి ప్రశంస :**

క. వికసత్ ప్రగతి సుమం బయి
ప్రకటిత విద్యా ప్రదీపభాసురమై స
స్య కనకమై మా కొరువు
ట్లకుఁ జెలి యగు మేడిపల్లిఁ బ్రస్తుతి చేతున్.

తే.గీ. మేడిపల్లి యనిన మేడిఫలము గాదు
మేడిపల్లి రాచమేడి పల్లె
మేడి పట్టి దున్ని పైఁడిని బండించు
పాఁడి పంటలకును బట్టుఁగొమ్మ.

**దత్తపది :**

బేరము, నేరము, దారము, సారము - ప్రస్తుతమున్న జనతా ప్రభుత్వము చేపట్టిన అభ్యుదయ కార్యక్రమాల గురించి.

ఉ. బేరము వారి గుప్పిటను బెట్టి ధరల్ దివి నంటకుండఁగా
నేరము వారి న్యాయముగ నేతల కైనను శిక్షవేయ భూ
దారము వంటి ద్రోహులను దండిగఁ గూల్చ భయావహస్థితిన్
సారము దంబు నిండఁ బెలుచన్ దొలఁగించి ప్రభుత్వ మేలెడిన్.

**సద్యోవర్ణనము :**

దర్జీకి పండుగకు బట్టలియ్యగా సమయానికి అందియ్యనిచో కలిగెడి అవస్థ గురించి.

ఉ. పండుగ వచ్చె నిప్పటికి బట్టలు కుట్టకపోయె దర్జి చీ
దండుగ యౌనా వేడుకలు దండిగ జర్గునా కూతు నల్లునిన్
నిండుగఁ దృప్తి చేయుటెటొ నేఁడు ప్రమాదము ముంచె
నాగకన్
బొండుగ నొత్తి తెత్తు నిఁకఁ బొందెద విందు పసందు
చందునన్.

సమస్య :

వెన్నెలతేని కాంతి గని విచ్చెను దామర లెల్ల వింతగన్.

ఉ. వన్నెల చిన్నెలన్ వెలుఁగు భాసిలఁ దావులఁ గుల్కు కల్వపూఁ
గన్నెల రాగతోయధి నిగారపు టోలలఁ దేల్చి చొక్కు యా
సన్నప్రభాతవేళ రవి చయ్యన రా వెలవెల్ల పోవు నా
వెన్నెలతేని కాంతి గని విచ్చెను దామర లెల్ల వింతగా.

నిషేధాక్షరి :

బృహన్నలను చూచిన ద్రౌపది మానసిక స్థితి.

క. అని నరిహరియై స్థాపిం
చిన ప్రథతో వెల్గి యేమి చెల్వాల నడమ్న్
జునిఁగిన లజ్జన్ నృత్యము
లను నేర్పును పేడియైఁ గలఁగు నెద మిగులన్.

నా పూర్వ విద్యార్థి, ప్రియమైన శ్రీ కల్లెడ సోమయ్య ప్రోత్సాహముతో శ్రీ పీతాంబరరావుగా రేర్పాటు చేసిరి.

# ఎలిగేడు

(కరీంనగర్ జిల్లా)　　తేది. 7-6-1977

**ఎలిగేడు ప్రశంస :**

క.　నేతలకున్ బల్ బట్టల
నేఁతలకుఁ బ్రజావితతికి నిరతము హితవౌ
చేఁతలకున్ నవధాన్యపుఁ
గోఁతల కెలిగేఁడు కీర్తిగాంచె మిగుల నహో!

**శ్రీ వెంగళ హనుమయ్యగారి ప్రస్తుతి :**

క.　గళమున జలదనినాదము,
విలసితహృదయమున సుధయు, విశ్రుతకీర్తిన్
జెలఁగెడు నాయకమణి వెం
గళ హనుమయ నభినుతింతు ఘనతరప్రేమన్.

**దత్తపది :**

రణము, గణము, కణము, చణము - భారతార్థములో.

చ.　రణము కురుప్రదేశమునఁ గ్రాలఁగఁ గౌరవఘోరవాహినీ
గణములు చెల్లరేఁగఁ దమకంబునఁ బార్థుఁడు శత్రుదేహముల్
కణములుగా ధరన్ బడ నకాండలయం బొనరించె, దివ్యులా
చణముదుదారశౌర్యమును జయ్యన మెచ్చుచు నుండ నింగిలో.

చణ=ప్రసిద్ధమైన, ముత్+ఉదారశౌర్యమును = సంతోషము
తోడి గొప్ప పరాక్రమమును.

సద్యోవర్ణన :

వేసవి తాపము గురించి.

ఉ. నిప్పులు రాల్చు నెండలకు నెట్టన భూవలయంబు కాలుచున్
గుప్పున లేచు ధూమములొకో యన రేఁగ దుమారముల్ కడున్
జెప్పఁగ రాని తాపముల జీవుల తావులు దప్పఁ బ్రాణముల్
గొప్పగ రాల్చెఁ జెమ్మటలు ఘోరపు మంటల నార్పనో యనన్

సమస్య :

దైత్యగణంబు లెల్ల విబుధాళిగ మారెను భారతంబునన్.

ఉ. కృత్యము లెన్నొ ఘోరముగఁ గీచకులై పొనరించి యెంతొ యౌ
ద్ధత్యము నల్పనాయకులు తాము ప్రజాళికిఁ జూపి యిప్పుడున్
సత్యపథంబు మా దనుచు సాగెదరీ జనతన్ విచిత్రమౌ
దైత్యగణంబు లెల్ల విబుధాళిగ మారెను భారతంబునన్.

నా వియ్యంకులు, సహృదయాగ్రణులు శ్రీ యెలిగేటి రా॥ వీరయ్య- కొత్తపల్లి వారి ప్రోత్సాహముతో నాయకవర్యులు, పద్మశాలి ప్రముఖులు, ఎలిగేడు సర్పంచు శ్రీ వెంగళ హనుమయ్యగా రేర్పాటు చేసిరి.

# చౌటిపల్లి

(నిజామాబాదు జిల్లా)      తేది: 15-8-1977

చౌటిపల్లి ప్రశంస :

శా. సస్యశ్యామలమై విశిష్టతరవిజ్ఞానాలయంబై రమా
లాస్యప్రోజ్జ్వలమంటపంబయి మహారాడ్వైభవంబై సహ
ప్రాస్యస్తుత్యసదామహాభ్యుదయకార్యాదర్శమై సత్కళా
వాస్యంబై వెలుగొందు చౌటుపలి మేల్ ప్రాశస్త్య
మూహించెదన్.

దత్తపది :

విస్తరి, దొప్ప, పుడక, పచ్చడి- కృష్ణరాయబారార్థమున.

మ.కో. విస్తరించెడు రాజ్యకాంక్ష వివేకమా కురురాజ! నీ
శస్త్రబుద్ధిని జూపవేటికి? చాటె దొప్పని మాటలన్
గస్తి యేలొకొ పుడక వచ్చునె కాలుప్రోలికిఁ బోవుచో
దుస్తరం బిది నిన్ను భీముఁడు ద్రుంచి పచ్చడిగా నగున్.

సద్యోవర్ణన :

కీ.శే. చౌటిపల్లి హనుమంతరెడ్డిగారి ప్రశస్తి.

ఉ. నాయకవర్యులై సతత మనాథుల బాధలు రూపు మాపుచున్
బాయక దేశసేవకయి భవ్యపదంబు లలంకరించి యా
ప్యాయముగా జనాళికి మహాభ్యుదయంబులు గూర్చెఁ
దా యశః
కాయుడు చౌటిపల్లి పురగ్రామణి శ్రీ హనుమంతరెడ్డహో!

సమస్య :

రామున్ దునుమాడె సీత రావణు నాజ్ఞన్.

క. భీమాహవమును జెప్పుచు
రాముం డనె నింద్రజిత్తు రణమున మూర్ఛన్
బో మన లక్ష్మణు దనుజవి
రామున్ దునుమాడె సీత! రావణు నాజ్ఞన్.

తా॥ రాముఁడు భయంకర యుద్ధమును గురించి చెప్పుచు 'సీతా! ఇంద్రజిత్తు రావణుని ఆజ్ఞచేత రాక్షస సంహారకుడైన మన లక్ష్మణుని మూర్ఛపోవునట్లు పడగొట్టెను' అని పలికెను.

నిషేధాక్షరి :

ప్రస్తుతము అష్టావధాన సభ రాయల భువన విజయమును తల పించునని వర్ణించుట.

క. శ్రీవిద్యలు కృత్యాళిన్
జీవించన్ రాయసభ విశిష్టముదమ్మున్
గావించిన చందము శో
భావహమై వెలిఁగె నీ సభాస్థలి మనచే.

అప్తులు, సహృదయవరేణ్యులు శ్రీ బోగ గంగారాము-వర్తకులు గారేర్పాటు చేయించి ఘన సన్మానము చేయించిరి. వారికి అధ్యాపకులు, ఆత్మీయులు శ్రీయుతులు గుండోజు శేషాద్రిగారు శంకర్‌గారు సహక రించిరి. మాజి ఎం.ఎల్.సి., మాజి జిల్లాపరిషత్ అధ్యక్షులు, ప్రసిద్ధ నాయకులైన కీ.శే. కె.అర్.హనుమంత రెడ్డిగారి కుమారులు శ్రీ గోవింద రెడ్డి గారు సభ కధ్యక్షత వహించిరి.

# ఖమ్మము

తేది : 6-11-1977

దత్తపది :

భగ్నము, నగ్నము, ఋగ్నము, మగ్నము - రామాయణార్థములో.

ఉ. భగ్నము లయ్యెఁ గోరికలు, బంధువు లెల్ల నశించి రెంతయున్
నగ్నము లయ్యెఁ బేటలు, వినాశము నందె సమస్త సంపదల్
ఋగ్నము లయ్యె గుండియలు బుద్ధిఁ దలంపక రామయుద్ధస
మ్మగ్నముగాఁ ద్వరం పడెదు మాను ప్రభో! యని వేడెఁ
గల్కి తాన్.

సద్యోవర్ణన :

కట్టెలమ్ముకొని జీవించువాడు కట్టెల మోపుతో వెళ్ళుచుండ ఎదుట కాలసర్పము కన్పడ పొందు బాధ వర్ణించుట.

మ. అతికష్టాంబుధి మున్గి తేలు చొకఁ డాయసంబుతోఁ గట్టెలన్
గతిలే కమ్ముట కేగుచుండ నెదుటన్ గాలాహి ఘోరంబుగా
రుతులన్ జేయుచు నిల్వఁగాఁ బడగపై, రుద్ధాంఘ్రిఁయై
ప్రాణముల్
గతులన్ దప్పఁగ గుండె గొట్టుకొనఁగా గాసిల్లె శోషిల్లుచున్.

సమస్య :

మానమునం దెక్కఁ గడు ప్రమాదముకాదే.

క. కానక కాలము దేశము
పూనికతోఁ గనక యంత్రములఁ ద్వరగఁ బర
ధ్యానమున నడపు నట్టి వి
మానమునం దెక్కఁ గడు ప్రమాదము కాదే.

నిషేధాక్షరి :

సరస్వతీదేవి వర్ణన.

క. శ్రీధీ భాదయు సుకళా
సాధనయున్ బూజ్య యయి రసప్రముఖాబ్ధిన్
బాధితనరులన్ దేల్చుచు
సాధక విజయమ్ము లొసఁగు జనని నుతింతున్.

శ్రీధీభాద=ఐశ్వర్యమును బుద్ధిని తేజస్సును ఇచ్చునది.

ఆత్మీయులు, ఆప్తులు, సహృదయ విద్వత్కవివరేణ్యులు, ఖమ్మంజిల్లా సహకార శాఖాధికారులు (D.C.O.) శ్రీ మహమ్మదలి గారుఏర్పాటు చేసిరి. గురుదేవులు, మహాకవి శిరోమణులు శ్రీ వాన మామలై వరదాచార్యులవారు అధ్యక్షత వహించిరి.

# కమ్మరిపల్లి

(నిజామాబాదు జిల్లా)   తేది. 14-11-1977

కమ్మరిపల్లి ప్రశంస :

ఉ. కమ్మని పాఁడి సంపదయుఁ గమ్మని పంటల భోగభాగ్యముల్
క్రమ్మర వచ్చిపోవు ఘనకార్మికపాంథజనప్రవాహ మం
క మ్మరవిందమార్దవము కమ్మని తియ్యని రాజకీయముల్
'కమ్మరు' కట్టి శ్రేయములు గాంచెడు కమ్మరిపల్లి నెంచెదన్.

కమ్మరు=నడుము (ఉరుదూపదము)

దత్తపది :

వెండి, బంగారము, రాగి, ఇత్తడి - రామాయణార్థములో.

శా. వీపుల్ బ్రద్దలు నయ్యు వెండి సమరావేశంబునన్ వచ్చె నే
ప్రాపుల్ గాంచెనొ నీ సహోదరుఁ డయో బంగారమున్ మించు నీ
రూపం బేక్షతి నొందరాదు వినుమా రోషంబు రాగిల్ల నీ
కో పూజ్యా! మెయి యిత్తడిన్ వెలుపుచే హూనం బగున్ మానవే.

సద్యోవర్ణన :

వేయి పదార్థు ప్రకటించి వట్టి కవ రిచ్చినారని తెలిసినప్పటి చింతను వర్ణించుట.

ఉ. వేయిపదారు లిచ్చిరని ప్రేమఁ గృతజ్ఞత తెల్పియుంటి న
యో్య! యొక దబ్బులేదె? ఇది యుత్తది, యుల్లము తల్లడిల్లెడిన్
నా యనువారు మోనము నొనర్చిరొ యేపొరపాటు కల్గెనో
మాయయొ నాదు కర్మమొకొ మాయని మచ్చగ నిల్చె
వేదనల్.

సమస్య :

సూర్యుఁడు చంద్రుఁడున్ గలిసిచూడఁగ వచ్చిరి భూప్రదేశమున్

ఉ. ఆర్యులు రాజు లెల్ల దమయంతి స్వయంవరసన్మహంబు శ్రీ
ధుర్యతఁ గాంచ రాఁగ నవధుల్ కనరాని త్వదీయరూపసౌం
దర్యము గాంచ దేవతలు తామరు దెంచుచు నుండఁ బెన్ దమిన్
సూర్యుఁడు చంద్రుఁడున్ గలిసి చూడఁగ వచ్చిరి
భూప్రదేశమున్.

నిషేధాక్షరి :

ఇందిరా తనయను గురించి స్వర్గవాసి నెహ్రూ తలంపు:

క. పదమున్ గాంచి సుప్రథతో
నెదలో సుధ నించె నంత నేమియొ కర్మం
బొదవెను బహుఘోరంబులు
పదవీచ్యుతయై విచారపడు నవమతులన్.

ఆత్మీయులు, సుకవివర్యులు, హింది పండితులు శ్రీ వొటారి
కారి చిన్నరాజన్న గారేర్పాటు చేయించిరి,

# ఆసిఫాబాదు

(ఆదిలాబాదు జిల్లా)   తేది: 20-11-1977

ఆసిఫాబాదు ప్రశంస :

శా. పేదల్ సాదులు గల్గి సత్కళలఁ బ్రావీణ్యమ్ములన్ వెల్గి మే
లౌ దాతల్ ధనికుల్ సహృజ్జనులు విద్యావంతు లొప్పారుచున్
కేదారంబులు లేక మెట్టలె భృతిన్ గీలించు ఈ ఆసిఫా
బాదున్ మండలకీర్తిపాదు నెదలో భావింతుఁ బ్రేమంబునన్.

క. అడవులతో నొడుదొడుకుల
గుడిసెలతో దుడుకుఁదనపు కొండెంగలతో
కుడువం దగు జొన్నలతోఁ
గడు నమృతపు టెదల నొప్పు ఘనపురి నెంతున్.

దత్తపది :

వరణము, మరణము, భరణము, చరణము - రామాయణార్థములో.

చ. వరణము దుష్టమై పరుని భామినిఁ గోరిన రావణుండు దు
ర్మరణముఁ జెందె, ధర్మమును మానక నిల్పిన రాముఁ డీ ధరా
భరణముగా వెలింగి కడు భక్తుల నర్చితుఁ డయ్యెఁ దా, సదా
చరణ మొనర్చు దేవునిగ, సల్పును దౌష్ట్యము మర్త్యు దైత్యుగా.

సద్యోవర్ణన :

ప్రస్తుత వాతావరణ వర్ణన.

ఉ. కర్షకు లెంతొ కాలమును గష్టము లోరిచి సాగుచేసి పెన్
హర్షముతోడఁ గోఁతలకు నాత్రపడన్ విధి వక్రమై యయో
వర్షము గుప్పుచున్ వరద పాలొనరించుటె కాక వ్యాధు లు
త్కర్షముగా జనించెడిని గాల మదెట్టులొ వచ్చెఁ జెల్లరే!

సమస్య :

రాధను వీడి మాధవుఁడు రంభను ముద్దిడఁ గంటినే చెలీ!

ఉ. వేధ లనేకమున్ గనిఁయు వెన్నుడ కెంతయు శౌర్యమూర్తియై
సాధుల బాధ మాన్పి యరిసంఘము గూలిచి ధర్మజీవనా
రాధకుఁ డయ్యె నేమిటిది? రాధికఁ బట్టుక రుక్మిణిన్ సదా
రాధను వీడి మాధవుఁడు రంభను ముద్దిడఁ గంటినే చెలీ!

నిషేధాక్షరి :

శీతకాల వర్ణన.

క. శ్రీదీబాక్ మర్త్యులఁ దా
బాధింపక బడ్గు లందుఁ బడి కసి తోడన్
వేధించు శీతకాలము
సాధించును జంటలకును సౌఖ్యాంబుధులన్.

ఆత్మీయులు, ఆప్తులు, సహృదయ విద్వల్లలాములు, బహు భాషావేత్తలు, ప్రధానోపాధ్యాయులు, శ్రీ మహాకాళి దత్తాత్రేయులు. చెన్నూరుగా రేర్పాటు చేయించిరి. మాన్యులు, విద్వద్వరేణ్యులు, ప్రముఖ రచయితలు శ్రీ సామల సదాశివగారు సభ కధ్యక్షత వహించిరి.

# కాగజ్‌నగర్ ప్రాజెక్టు క్యాంపు

(ఆదిలాబాదు జిల్లా) తేది. 21-11-77

ప్రాజెక్టు క్యాంపు ప్రశంస :

మ. పరదేశంబులనుండి త్రోయఁబడి దౌర్భాగ్యంబు వెంటాడఁగా
శరణం బం చరుదెంచు దీనులకు విశ్వప్రేమ నావాసముల్
దొరయం జేసి సమర్థవృత్తుల భృతిన్ దోడ్తోన కల్పించు బం
ధురప్రాజెక్టును నిర్వహించు వరపుణ్యుల్ మీకు జోహారువుల్.

చ. జిగిబిగి లేని నేలలును జేవలు చచ్చిన కార్మికావళుల్
బుగబుగ లేచు క్రొంబొగలు ప్రొద్దున మాపుఁ గలంచుఁ పెన్ రొదల్
నగవనకంటకంబులు ననాగరికప్రజ రెచ్చి ప్రాణముల్
సగ మొనరించు ఖత్రపురిసన్నిధి నుండు మిమున్ నుతించెదన్.

దత్తపది :

ముని, వని, గని, శని - ఈ పదములను స్వార్థమున గాక ప్రయోగించి భారతార్థమున చెప్పుట.

చ. వనజభవాభమౌని యనివార్యవరమ్ము నిజేచ్ఛ నీయ న
వ్వనిత కుతూహలంబుమెయి భాస్కరుఁ బిల్చి కుమారశేఖరున్
గని పడవేసె జాహ్నవిని, కట్టడి దైవము కుంతికిన్ మహా
శనిసదృశంబుగాఁ గలఁచెఁ జాలని బుద్ధికి జీవితాంతమున్.

సద్యోవర్ణన :

ప్రస్తుతము దివి సీమలో వచ్చిన తుఫాను బీభత్సము గురించి.

శా. ఘోరంబైన తుఫాను జృంభణకు దిక్కున్ మొక్కు
లేకుండగ
నీరై కొట్టుకపోయె వాటికలు, మున్నీరై సహస్రప్రజల్
హాహాకారిగ బోరి చచ్చి రయయో!, యూళ్ళన్ని
బీళ్ళయ్యెగ
దారంబుల్ వరసస్యసంపద నిరాధారంబు లయ్యెన్ గడున్.

సమస్య :

రాత్రిసమయముల నొసంగె రవి కర్త్యములన్.

క. పాత్రుం డయి శాస్త్రంబుల
సూత్రంబులఁ దప్పకుండ సుపథిన్ జను స
ద్గోత్రద్విజుఁడు గడవఁగనె
రాత్రి, సమయముల నొసంగె రవి కర్త్యములన్.

నిషేధాక్షరి :

ప్రస్తుత సభ గురించి.

క. ప్రేమోద్ధిని దేలను, నా
శ్రేయమ్మును వల్చి సభకు చిత్తద్రుమశ్రే
ణీయుక్తవికాసార్థ
మ్మీ యవధానమ్ము వినఁగ నేతెంచి రహో!

ఈ సభను శ్రీ మహాకాళి దత్తాత్రేయులుగా రేర్పాటు చేయిం చిరి. వారప్పుడు కాగజ్‌నగర్ ప్రాజెక్టు క్యాంపు ప్రభుత్వోన్నత పాఠ శాలలో ప్రధానోపాధ్యాయులుగా ఉండిరి.

# కరీంనగరము

తేది : 11-12-1977

## కరీంనగరము ప్రశంస :

చ. సిరులకుఁ దావలం బయి విశిష్టకవీంద్ర బుధప్రహృష్టమై
నిరుపమ సత్పరిశ్రమ మణివ్రజ భాసురమై ప్రభావ మే
దురబహు రాజకీయ పరితోషితప్రాంతమునై చెలంగు మా
కరినగరమ్ము మండలవికాసవరమ్ము కరమ్ము నెంచెదన్.

## నటరాజ కళానికేతనము ప్రశంస :

ఉ. సాహితియున్ బ్రశస్తమగు సాంస్కృతికంబు నెసంగఁగా
మహో
త్సాహముతో నిరంతరము చక్కని కార్యము లాచరించుచున్
శ్రీహరి సత్కృపాప్తి వెలసెన్ నటరాజకళానికేతన
మ్మోమహా వటోపమానమయి యుర్వర వర్ధిలుఁగాక! శాఖలన్.

## దత్తపది :

బండ, ముండ, రండ, దండ - భాగవతార్థములో.

ఉ. బండలు కొండలున్ గడచి భద్రతమంబు గిరివ్రజంబు భీ
ముం డమరేశజుండు నతిమోదముతో హరి చేరఁబోవ పీ
రండకు వచ్చి రంచు మగధాధిపుఁ డాదృతిచేయ మేము నీ
దండకుఁ బోరు కోరి యిటు దారితి మంచు వచించి రుగ్రతన్.

## సద్యోవర్ణన :

పెండ్లిపీటలమీద కూర్చుండబోవు వధువు మదిలోచి చింత.

చ.	మనసు ప్రమోదమౌ పగిది మాన్యుఁడు నా పతి యేలుకొన్న నా
నుపమదివ్యసౌఖ్యముల హాయిగఁ దేలుదుఁ గ్రూరుఁ డైన నా
దినదినారకవ్యథల దిక్కరి కూలుదు భాగ్య మేగతిన్
నను నడపించునో యని మనంబునఁ గన్యక యారటంపడెన్.

సమస్య :

శనివారము కాదు కాద శనివారమ్మే.

క.	ఘన ఝంఝు ఘోరగతి ను
ప్పెనగా జృంభించి ప్రళయ బీభత్సంబున్
బొనరించె మొన్న యమొ! యది
శనివారము కాదు కా దశనివారమ్మే.

అశనివారము=పిడుగుల దినము. దివి సీమలో తుఫాను చెల రేగిన దినము.

నిషేధాక్షరి :

వామన చరిత్రము గురించి.

క.	రక్షోరాట్ శ్రీ దోఁచన్
భిక్షకు నే బైసిఁ గాక బేల యనన్ దా
నక్షయ మగు మూఁడడుగుల
నా క్షితిలో నడిగె వటుఁడు అబ్బుర మొదవన్.

ప్రియమిత్రులు, నటశేఖరులు, దర్శకులు, ఆడిటర్, వేములవాడ నటరాజ కళానికేతనము స్థాపకాధ్యక్షులు శ్రీ మంచె సత్యనారాయణ గారు తమ సంస్థ వార్షికోత్సవ సందర్భములో సభ ఏర్పాటు చేసిరి. సభకు కరీంనగర్ శ్రీ రాజరాజేశ్వర కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ కే. వై. ఎల్. నరసింహారావుగా రధ్యక్షత వహించిరి. మాన్యులు, అచల బోధ గురువరేణ్యులు, 'శ్రీకరానంద' శ్రీ పిన్నమశెట్టి చిన్న యాఖ్యులు గారు స్వయముగా సన్మానించిరి.

# బెజ్జంకి

(కరీంనగర్ జిల్లా) -12-1977

**బెజ్జంకి నరసింహస్వామి స్తుతి :**

క. శ్రీకరు వరదాయకసుర
శేఖరు భక్తాంతరంగచిత్కుహరుసుధా
శ్రీకరు సర్వజనాళివ
శీకరు బెజ్జంకి నారసింహుని దలఁతున్.

**బెజ్జంకి ప్రశంస :**

ద్విపద. విజయాంకరచితమౌ బెజ్జంకి పురము
ఏకశిలావృష్టి నెంతయు నెగడు
కోన ఋష్యాశ్రమమ్మో నాఁగ వెలయు
మంచి నేతలకును మహితమై చెలఁగు
అందాల బెజ్జంకి నభినుతి చేతు.

**శ్రీశ్రీ గాదె శంకరయ్య ప్రశంస :**

క. భోగమ్ముల యోగమ్ముల
రోగమ్ముల బ్రతుకు సాగ రోచిష్ప్రతిభా
యోగమ్మున వరకవితా
శ్రీ గాదెను నింపి పంచు శ్రీగాదె యహో!

**దత్తపది :**

అంకము, పొంకము, బింకము, పంకము - ఉదంకుని చరిత్రము గురించి.

ఉ. అంకములోని పౌష్యనృపు సంగన యిచ్చిన కుండలంబులన్,
పొంకము తోడఁ గొంచుఁ జనఁ బొంచిన తక్షకుఁ డెత్తు
కేఁగఁగన్
బింకము డించి వేళకు మునిన్ గని యిచ్చెఁ దదీయపత్నికిన్
పంకములేని జీవనప్రభాయుతుఁడైన యుదంకుఁ డద్దిరా!

## సద్యోవర్ణన :

గురుకుల విద్యాలయము గురించి.

క. గురుతరులన్ ఛాత్రాధిక
వరతాపోపశమములను వర్ధిలు నేత
ద్గురుకుల ముపవనము వలెన్
బరమంబుగ శాంతిసౌఖ్యప్రదమై యొప్పున్.

## సమస్య :

కాకియుఁ గోకిలయుఁ గలిసి కాఁపుర ముండెన్.

క. ప్రాకట దుగ్ధార్ణవమునఁ
గాకోలము సుధయు నున్న గతి మన భూమిన్
లోకు లసత్సద్గతు లయొ!
కాకియుఁ గోకిలయుఁ గలిసి కాఁపుర ముండెన్.

## నిషేధాక్షరి :

బెజ్జంకి నృసింహస్వామి గురించి.

క. శ్రీలన్ శ్రేష్ఠప్రభుతలన్
మేలౌ విద్యాప్రభాశి మెప్పవు హృత్ స
చ్ఛీలములన్ బెజ్జంకి ప్ర
జాశికి నరసింహుఁ డొసఁగి యలరుత! సతమున్.

ఆత్మీయులు, సహృదయ విద్వత్కవి వర్యులు శ్రీశ్రీగాదె శంకర కవిగా రేర్పాటు చేసిరి.

# ఆదిలాబాదు

తేది. 29-1-1978

**ఆదిలాబాదు ప్రశంస :**

మ. అటవీసంపద నింపి వెంపెసఁగు గేహానీకమున్ గూర్చి యు
త్కటశక్తిప్రదభోజనం బిడి మహాకార్పాసలక్ష్మీకృపన్
పటముల్ దాల్పఁగఁ జేసి వంశవిలసత్పత్రోరువిద్యాప్రభా
పటలంబై యలరారుచుండు నదిలాబాదున్ బ్రశంసించెదన్.

**కుటుంబ సంక్షేమశాఖ స్తుతి :**

క. ఆరోగ్యభాగ్య మిచ్చుచు
సారోద్యజ్జీవనంబు సాగఁ బ్రజాబ్ధిన్
వారధి కట్టుచు వెలసెడి
యారోగ్యసమాఖ్యశాఖ నభినందింతున్.

**దత్తపది :**

రచ్చ, లచ్చ, బిచ్చ, సిచ్చ - కుటుంబ సంక్షేమము గురించి.

క. రచ్చకు నీడ్చును కోమటి,
లచ్చనమే పిల్లవాండ్ర లక్షలఁ గనినన్
బిచ్చపుగతి యేటికి? మన
సిచ్చను జెలఁగంగ సంతు నింతే యుంతున్.

**సద్యోవర్ణన :**

బహుకుటుంబి ఛాందసుడు కుటుంబ సంక్షేమ చర్యగురించి చింతించుట.

చ. జలజభవుం డొసంగు బహుసంతతి, మానవమాత్రుఁ డేగతిన్
నిలుపఁగ నేర్చుఁ బాప మగు, నిల్పక యుండినఁ దాప
మయ్యెడిన్
బల మగు శంక నా యెదను బట్టెను, ఛాందస మేల క్షేమమై
సలలితసౌఖ్యముల్ వెలయ శస్త్రచికిత్సకుఁ బోదు నిప్పుడే.

సమస్య :

గరుడుఁడు గణపతికిఁ దండ్రి కావలె సుమ్మీ!

క. వరవచన మిడిన చొప్పున
ధరాప్రదక్షిణకుఁ బెండ్లి తన కొనరింపన్
దొరకొన్న పాపకుండలి
గరుడుఁడు గణపతికిఁ దండ్రి కావలె సుమ్మీ!

నిషేధాక్షరి :

హేమంత వర్ణన.

క. రవియే సీమకు బేలఁగ
దివిఁ బో నరపాళి కేమి తేకున్నె వెతల్
భువి నివము గురియుచున్ గడు
జవమున హేమంత మదరి జడిమను గూర్పన్.

స్థానిక కుటుంబ సంక్షేమ శాఖవా రేర్పాటు చేసిరి. ఆంధ్రో పన్యాసకులు శ్రీ నారాయణరెడ్డిగారు సభ కధ్యక్షత వహించిరి.

# హుస్నాబాదు

(కరీంనగర్ జిల్లా)      తేది : 23-4-1978

## హుస్నాబాదు ప్రశంస :

శా. శ్రీదంబై సుకళాసుధాలహరికా శ్రేయస్కరంబై ప్రజా
ఖేదోన్మూలక రాజకీయతరుసంకీర్ణాతపత్రాళియై
మోదాపూరక రమ్యరమ్య జనతా భోగంబునై విద్యకున్
పాదై పేరును బెంపు గల్గు హుసునాబాదున్ బ్రశంసించెదన్.

## హుస్నాబాదులోని నవోదయ ఆర్ట్ థియేటర్ ప్రశంస :

చ. కవుల నటప్రకాండులను గాయకవర్యులఁ జిత్రకార భా
రవుల సృజించి మించి సుకళామకరందములన్ వెలార్చుచున్
చవులనుఁ దన్పుచున్ జనుల సత్పథగాములఁ జేయుచుండి యీ
భువి ఘనకీర్తి వెల్గుత! నవోదయ ఆర్టు థియేట రెప్పుడున్.

## దత్తపది :

హారము, పారము, భారము, నేరము - సభాసదుల గురించి.

ఉ. హారముఁ బోలు పండితజనాళి కళాసురభిన్ వెలార్పఁగా
పారము లేని గెల్పని సభాజన హృద్భవనంబు లొప్పఁగా
భారము గూర్చు వాదములు పైకొని డెంధములన్ గలంచె నే
నేరము లాచరింతిమొ నేఁటికి నీగతి పట్టె నయ్యయో!

సద్యోవర్ణన :

లోకులకు మంచి నడవడికి హితవు చెప్పుట.

మ.కో. ఏమి చేసినఁ గూటికే మరి యెంత సాగినఁ గాటికే
కామినీ జనకాంచనంబులఁ గ్రమజన్మము వ్యర్థమౌ
నేమముల్ గల సత్ప్రవర్తన నెమ్మి నిచ్చు జయంబులన్
గాము వోలిన దుర్మదంబుసఁ గన్ను గానవ మానవా!

సమస్య :

తమ్ముఁన్ జంపిన వాని దేవుఁ డనినన్ దప్పేమి యొప్పే
యగున్.

శా. అమ్ముల్ గ్రుచ్చుచు మాటమాటకు విశిష్టాచారవర్గమ్ము దుః
ఖమ్ముల్ వెట్టుచుఁ గామక్రోధములలోఁ గష్టాత్ముడై మున్గుచున్
వమ్మై శోక యనర్థహేతు వగు పాపస్వాంత మన్ ఘోరభూ
తమ్ముఁన్ జంపినవాని దేవుఁ డనినన్ దప్పేమి యొప్పేయగున్.

నిషేధాక్షరి :

నూతన సంవత్సరాది వేపపూవుపచ్చడి గురించి.

క. శ్రీ ధీభూవాక్ శ్రీ సం
బాధకమౌ జగతిలో శుభదసమ్యక్ సం
శోధక ముగాది పచ్చడి
సాధకమై వఱలు నవవసంతోత్సవమై.

మిత్రులు కవివర్యులు శ్రీ బి. రామశర్మ పోస్టుమాస్టరుగా రేర్పాటు చేయించిరి. మిత్రులు, విద్వత్కవివర్యులు శ్రీ పార్వెళ్ళ గోపాలకృష్ణగా రధ్యక్షత వహించిరి.

# రాయికల్లు

(కరీంనగర్ జిల్లా)　　తేది : 25-4-1978

## రావికంటి ప్రశంస :

ఉ.　పౌరుషమున్ బరాక్రమము ఖాసిలు, గాసిలు పేదసాదులన్
వారక రక్షసేయు, బహుభంగుల హంగుల రాజకీయముల్
సారెకు పొంగు, అంగడుల సంగడి బంగరు పాఁడిపంటలన్
బేరెసలారు రాయికలు పెంపును సొంపు నుతింతు నెంతయున్.

## శ్రీ కేశవనాథస్వామి స్తుతి :

క.　శివుఁ డబ్జభవుఁడు తానై
భవతారకుఁ డగుచు దీనబాంధవుఁ డగుచున్
భువి రావికంటఁ గల కే
శవనాథస్వామిఁ దలఁతు జయము లొసంగన్.

## దత్తపది :

సబ్బు, జబ్బు, మబ్బు, డబ్బు-రామాయణార్థములో.

చ.　కదు మన సబ్బురంపడు జగత్పతిరాముని దివ్యగాథ లే
ర్పడ వినఁ బోవు మానసికబాధలు జబ్బులు సర్వపాపముల్
బెడఁగగు మబ్బు బోలు రఘువీరుఁడు రాక్షసజాతిఁ గూల్చి యీ
పుడమిని గాచెఁ దత్కరుణఁ బొందినచో నెపు డబ్బు
శ్రేయముల్.

**సద్యోవర్ణన :**

పురాతన దేవాలయ జీర్ణోద్ధరణ గురించి.

ఉ. మేలగు శిల్పసంపదల మించి సమంచితభక్తిముక్తులన్
జాలఁగ నిచ్చి వైభవప్రశస్తముగా విలసిల్లి పూర్వదే
వాలయసంతతుల్ శిథిలమై యణఁగారె, జగచ్ఛివార్థమై
యోలి సముద్ధరించవలె నుత్తమసంస్కృతి నిల్పఁగా వలెన్.

**సమస్య :**

మలమును గొని రమణి యోర్తు మరిమరి మురిసెన్.

క. చెలువగు వలువలు దాలిచి
కలితాలంకరణగా నిగారముగా మ
ల్లెలు తురిమి మెచ్చుగాఁ బరి
మలమును గొని రమణి యోర్తు మరిమరి మురిసెన్.

**నిషేధాక్షరి :**

ఓడిన ఇందిరాగాంధి దక్షిణాదిలో గెలుపొందిన విషయానికి జనతాపార్టీవారు పొందిన ఆందోళన గురించి.

క. తేరాని మచ్చతోఁ బ్రథ
తీరన్ దా దాగకుండఁ దెన్నుప్రజ లిటన్
గోరన్ నెగ్గిన దిందిర
యౌరా! యని జనతవార లార్చిరి బాధన్.

ఆప్తులు, రావికంటి పురప్రముఖులు శ్రీ కడకుంట్ల గంగారాము గారు (తరువాత ఎం.ఎల్.ఏ అయినారు) స్థానిక పద్మశాలి సంఘం పక్షాన ఏర్పాటు చేయించిరి. ప్రియమైన అల్లుడు శ్రీ గుట్టి భూమ రాజముగారు- అధ్యాపకులు విశేష కృషిచేసి సహకరించిరి. ఆప్తులు, కోరుట్ల పద్మశాలికులోన్నతి సంఘాధ్యక్షులు శ్రీ ఎక్కలదేవి లక్ష్మణ గారు సభ కధ్యక్షత వహించిరి.

# చిట్టాపురము

(కరీంనగర్ జిల్లా)                తేది. 8-8-1979

**చిట్టాపుర ప్రశంస :**

ఉ. తీపులు గుల్కు పంటలును దియ్యము నెయ్యము జిల్కు
జంటలున్
కాపుల పైఁడి చేఁతలును గౌఁడుల గీఁతలు శాలి నేఁతలున్
గోపురశోభిసంపదలు కూరిమి పెంచు నెదల్ చెలంగు చి
ట్టాపురమున్ దలంతు నికటస్థితధర్మవరమ్ము నిమ్ముగన్.

క. అయ్యలవుర మొక దెసనున్
దియ్యని ముత్యమ్ము పేట దెస నొక్కట బల్
నెయ్యపు ధర్మవర మొకట
నయ్యరె! చిట్టాపురము మహాభాగ్యమిలన్.

**శ్రీ అంగడి రాజేశ్వరయ్యగారి స్తుతి :**

క. సంగవిరహితులు భూతల
జంగమపరమేశ్వరులును సన్మార్తికి మేల్
కొంగుఁబసిఁడియై చెలఁగెడి
యంగడి రాజేశగురుల కభివందనముల్.

**శ్రీ గాజుల రాజరాము శేటుగారి స్తుతి :**

క. గాజుల వంశపయోనిధి
రాజును లక్ష్మీకటాక్షరంజితతేజున్
భ్రాజద్గుణమణిధామున్
రాజారామున్ నుతింతు రమ్యస్థేమున్.

సీ. దైవతసద్భక్తి ధర్మకార్యాసక్తి
ఎదలలోఁ బొదలఁగా మెదలువాఁడు
సాధుసజ్జనసేవ జాతిసంస్కృతి తీవ
ఇంపొందఁ బెంపొంద నెనఁగువాఁడు
కవిపండితులఁ గాంచి గానాదికళ లెంచి
నుతుల సత్కృతుల మేల్ వెతకువాఁడు
శ్రమ లోర్చి పెంచిన సంపదల్ నించిన
భోగాల త్యాగాలఁ బొలుచువాఁడు

గీ. సిరుల గిరు లెక్కి నిక్కని శిరమువాఁడు
వరనగరు లెక్కి పల్లె నేమరనివాఁడు
భవ్యగుణశాలి హితశీలి పద్మశాలి
రమ్యరత్నమ్ము గాజుల రాజరాము.

దత్తపది :

పోకచెక్క, మామిడితొక్క, కొబ్బరిముక్క, గంధపుచెక్క. రామాయణార్థములో.

సీ. భోజన మైనది పోఁకచెక్క లవేవి?
అకులే యిచ్చినా రనె నొకండు
మెక్కిన మామిడి తొక్కలు దారిలో
వేయకు జారునన్ విప్రుఁ డొకఁడు
కొబ్బరి ముక్కలు కొని దాఁచరా రేపు
పచ్చడి కగునని పలుకు నొకఁడు
గంధపు చెక్కల కలకలాపము లెన్న
నలఁదురా వేసవి యను నొకండు

గీ. రామచంద్రుండు సీతను రాణ చెలఁగ
పెండ్లియాడిన యుత్సవవేళ నలరి
చెలఁగి యొండొండు సరసాలు కలకలముగఁ
బరఁగ నాడిరి వీనుల పండువుగను.

సద్యోవర్ణన :

అవధానము మధ్యలో అవధాని కాల్యమునకు లేచి వెడలగా శ్రోతల మానసిక స్థితిని వర్ణించుట.

క. అవధానం బొనరించు పండితుఁడు మధ్యన్ లేచి కాల్యార్థమై
యవలన్ బోయిన శ్రోత లెల్ల నిది యేమాయెన్ దినన్
బాత్రముల్
అపలన్ ద్రోసిన యట్టులయ్యె నిపుడీ యాచార్యుఁ డస్వస్థుఁడో
యవివేకంబొకొ మాదు భాగ్య మిదియో యం చాడి
రల్లాడుచున్.

సమస్య :

తన బాలుని జంప నెంచి తానే చచ్చెన్.

క. ఘనరాక్షసి దుర్మతి కం
సుని పంపున సుందరి యయి సొరిది విషమ్ముల్
నినిచిన పాలిండ్లను బూ
తన బాలునిఁ జంప నెంచి తానే చచ్చెన్.

నిషేధాక్షరి :

యముడు కాలపాశము వేసినపుడు మార్కండేయుడు పొందిన మానసిక స్థితి.

క. భీతిల నేలా? భర్గుని
బ్రాతిగ గ్లొభృత్తుఁ గొల్వఁ బ్రాము నరిష్టం
బెతీరు గలుగు యమునికి
నా తండ్రియె యముఁ డగుచును నను రక్షించున్.

మిత్రులు శ్రీ గాజుల రాజరాముశెట్టుగా రేర్పాటు చేయించిరి. పూజ్యులు శ్రీ అంగడి రాజేశ్వరయ్యగారు సభ కధ్యక్షత వహించిరి.

# జనగాం

(వరంగల్ జిల్లా)        తేది : 23-9-1979

**జనగామ ప్రశంస :**

ఉ. హేమము లొల్కు వర్తకులు నింపులు సొంపులు గుల్కు
వర్తకుల్
సామము భీమమున్ జెలఁగు చక్కని చిక్కని రాజకీయముల్
ధీమహితంబులై యలరు దివ్యకళల్ చెలువొందు సజ్జన
గ్రామము నాఁ జెలంగు జనగామ గుణోత్తరధామ నెంచెదన్.

**దత్తపది :**

భళిరా, వలెరా, కలరా, చెలిరా - శృంగార విషయకముగా.

మ. భళిరా! యీ పదఁతుల్ విలాసగతులన్ బ్రహ్మాండముల్
బంతులన్
వలె తాగిల్లి చలింపఁ జేసెదరు, నానాసుందరీ బృందముల్
కలరా? యందములందు లోకములలోఁ గానంగ రారెందు, ఈ
చెలిరా నెచ్చెలి నాకు నాకని వచించెన్ గాముకవ్రాతముల్.

**సద్యోవర్ణన :**

గణపతిదేవ చక్రవర్తి కూతురు కుముద్వతి జనగామ వద్దగల నదిని చూచి చేసిన నృత్యము గురించి.

ఉ. నీరదగర్జనంబులకు నిస్తులమోదము పొంగి నాట్యముల్
వారక చేయు కేకి వలె భామ కుముద్వతి యా నదీతరం
గోరు విలాస లాస్యముల నుల్లస మంబర మంద నృత్యమున్
జారుతరంబుగా సలిపె సర్వజగంబులు మోహితంబుగన్.

సమస్య :

పల్వురు గూడి యొక్కతెను బాధల నొంచుట ధర్మమే యగున్ - ఆధునిక భారతమున కన్వయించి చెప్పుట.

ఉ. విల్వలు కాలరాచి యొక పెద్దను మెచ్చక మచ్చరించుచున్
సల్వురు చెప్పినన్ వినక నాదియె శ్రేష్ఠ మటంచు మొండిగా
నిల్వన లేచి యేంచగను నెక్కొని యిందిరఁ గూల్చి రందరున్
పల్వురు గూడి యొక్కతెను బాధల నొంచుట ధర్మమే
యగున్.

నిషేధాక్షరి :

కోపనయగు సత్యభామ మేడకు బోవునప్పటి కృష్ణుని యవస్థ.

క. సతి కిన్క నేమి నల్పుచు
వెత గూర్పన్ మలయునో వివిధములఁ బ్రజ్ఞా
న్వితచర్యల సత్య మనసు
నతుకంగా వలయు ననుచు హరి యరుదెంచెన్.

ఆత్మీయులు, పరమ సహృదయులు, వృక్ష శాస్త్రోపన్యాసకులు, పూర్వము కోరుట్ల జూనియర్ కళాశాలలో నా సహోపన్యాసకులు శ్రీ వి. వెంకటరావుగారు స్థానిక సంగీత నాట్య కళాశాల సంస్థవారిచే చేయించిరి. ఆంధ్రోపన్యాసకులు శ్రీ శ్రీనివాసాచార్యులుగారు సహక రించిరి.

# వరంగల్

తేది : 4-5-1980

వరంగల్ ప్రశంస :

ఉ. కాకలు తీరినట్టి దృఢకాయులు శూరులు రాజనీతి వి
ద్యాకృతు లుజ్జ్వలప్రతిభ కాస్పదమౌ సుకవీంద్రబృందముల్
కాకతిరాజచంద్రుల జగా వెలుఁగుల్ జగ మెల్ల రమ్యమై
యేకముగా విరాజిలిన యేకశిలానగరంబు నెంచెదన్.

ఉ. దండి పరిశ్రమల్ కళలు దాతలు నేతలు పండితోత్తముల్
కొండలు బండలున్ బడిన కోటలు లేచిన మేటి పేటలున్
ఖండితశిల్పమూర్తులు నఖండమహోజ్జ్వలకీర్తు లొప్పఁగా
రెండవ రాజధానిగ ధరిత్రి వెలింగెడి నోరుగ ల్లహో!

దత్తపది :

అక్కర, చక్కెర, ఉక్కర, కొక్కెర - పోతనగారి కవిత గురించి.

ఉ. అక్కరణమ్ము పోతన మహాకవితల్ వినుతింప శక్యమే
చక్కెర కంటె తీయనయి సారమరందము లొల్కుచున్ బళే
ఉక్కరజేసి డెందముల కుజ్జ్వలభక్తి నెసంగఁ జేయుఁ గా
కొక్కెర వేసి పెక్కుగొను నుక్కివుఁడా మన పోతరాజు తాన్

సద్యోవర్ణన :

కాకతీయ చక్రవర్తుల ప్రస్తుతితో వసంత గ్రీష్మములను సమన్వయించుచు వర్ణించుట.

ఉ. భీకరకాకతీయపృథివీవరచండప్రచండశౌర్యముల్
కాకలుగా, తదీయకృత క్రమకళల్ హృదయప్రమోదిగా
నేకము లౌచు గీష్మమును నింపగు నామని యౌచు నొప్పఁగా
లోకము దద్దరిల్ల సెగలున్ బొగ లేర్చెడి నోరుగంటిలో.

సమస్య :

నందుఁడు గౌఁగిలించె రఘునాయకు నంతట మోహచిత్తుఁడై.

ఉ. కుందక తండ్రి యానతిని గోమలి సోదరుఁ గూడి కానకై
యెందుకుఁ బోయె నన్న యని యేడ్చుచు నా భరతుండు వెంటనే
వెందమిఁ బోఁఖ రమ్మనుచు వేడిన, రాఁ దగదన్నఁ దా గతా
నందుఁడు కౌఁగిలించె రఘునాయకు నంతట మోహచిత్తుఁడై.

నిషేధాక్షరి :

ఓరుగంటి వీధులలో నల్లానీళ్ళకు తపించు స్త్రీల యవస్థ.

క. రామల్ నీళ్ళన్ గానక
యేమో గతి నేఁడటంచు నెంతో సేగిన్
చీమల బారుల పోలిక
వే మూఁగిరి యోరుగంటి వీధుల నయయో!

వరంగల్ పద్మశాలి అఫీషియల్స్ & ప్రొఫెషనర్స్ అసోసియేషన్ (POPA) వారు నిర్వహించినారు. ఆంగ్లోపన్యాసకులు శ్రీ కె. జగదీశ్వరరావుగారు కన్వీనరుగా ఉండిరి. మాన్యులు, సహృదయ విద్వత్కవివర్యులు, విమర్శకాగ్రేసరులు డా॥ కోవెల సంపత్కుమారాచార్యులుగారు సభ కధ్యక్షత వహించిరి.

# కరీంనగరము

తేది. 2-11-1980

**ఆంధ్రభూ రమణికి శుభాకాంక్షలు :**

చ. ఇరువదినాలు గేఁడులు వహించి రహించిన ఆంధ్రదేశభూ
తరుణికి వైభవంబుగ సుధాప్లుతిగా రజతోత్సవంబులన్
గర మనురక్తి సల్పెదము; కామితముల్ ఫలియించి యామెకున్
అరు దరుదై చెలంగు సకలాభ్యుదయంబు లెసంగుఁ గావుతన్!

**శ్రీ కంభంపాటి సుబ్రహ్మణ్యశర్మ కలెక్టరు గారి ప్రశంస:**

మ. విలసద్దివ్య గుణాభిరాములు కళాభిజ్ఞుల్ రసజ్ఞాగ్రణుల్
లలితాకారులు మండలాధిపమణుల్ లక్ష్యార్థసంధాయకుల్
ఫలవత్కార్యవిధాయకోత్తములు సుబ్రహ్మణ్యశర్మాభిధా
నులు వారిన్ వినుతింతు సత్ప్రభుల హృన్మోదంబు
దైవారఁగన్.

**దత్తపది :**

చెత్త, దుత్త, గిత్త, నత్త-రామాయణార్థమున.

ఉ. చెత్తలు వానరాధములు, చేవలు లేని నరుల్ జగంబులం
దుత్తమవీరశూరుఁడ మహోజ్జ్వలతేజుఁడ రావణుండ, బా
గిత్తటి సర్వలోకముల నేఁచెద నంచుఁ జెలంగ శౌరి తా
నత్తఁగఁ గూర్మి పేర్మిని నరాకృతి వాని వధించె ప్రేమ్మిడిన్.

సద్యోవర్ణన :

ప్రస్తుతావధానము జరుగుచున్న సభాభవన వర్ణన.

సీ. రాజరాజనరేంద్రరమ్యవిద్యత్సభ
యదరి యీ తీరుగాఁ బొడమె ననఁగ
విక్రమసింహపురాక్రీడహంస మ
నుమసిద్ధికవితతి యమరె ననఁగ
శ్రీకృష్ణరాయల శ్రీమద్భువనవిజ
యమ్ము నేఁ డీరీతి నలరె ననఁగ
రఘునాథభూపాలరాట్సభాపండిత
బృంద మీ చందాన వెలసె ననఁగఁ

గీ. దనరి ఆంధ్రప్రదేశావతరణదివస
రజతపర్వంబునన్ మహారంజనముగ
సాగి యష్టావధానసంసత్తు వెలయుఁ
బండితకవీంద్రమండలహిండిత మయి.

సమస్య :

పిల్లికిఁ బక్షముల్ గలుగ వింటికి నేగెను వింత గొల్పుచున్.

ఉ. మెల్లగఁ బొంచి పావురము మీఁదఁ బడంగఁ దలంచు పిల్లినిన్
జెల్లరె! చూడ కాత్మసతి చెంత వినోదనిమగ్నమై కడున్
పుల్లమనంబునన్ జెలఁగి, బోరునఁ బైఁబడ భీతిజెంది యా
పిల్లికిఁ, బక్షముల్ కలుగ వింటికి నేగెను వింత గొల్పుచున్.

నిషేధాక్షరి :

చతుర్విధ పురుషార్థదాయినియగు వాణి ఆంధ్రుల ననుగ్రహించు విషయము వర్ణించుట.

క. విశ్వంబు నేనె నా ధీ
భాస్వత్శ్రీద యగు నంబ వాణి సతమ్మున్
విశ్వమున నెగడ నాంధ్రుల
శశ్వద్వైభవము లొసఁగి సాకుత! కరుణన్.

ఆంధ్రప్రదేశ్ అవతరణ రజతోత్సవముల సందర్భమున జిల్లా పరిషత్తు మీటింగు హాలులో ఏర్పాటు చేసిరి. జిల్లా కలెక్టరు శ్రీకంఠం పాటి సుబ్రహ్మణ్యశర్మగారు ముఖ్యాతిథిగా పాల్గొనిరి.

# రుద్రూరు

(నిజామాబాదు జిల్లా) తేది : 18-1-1981

## రుద్రూరు ప్రశంస :

ఉ. కాకతి చక్రవర్తిని జగత్పరికీర్తిత రుద్రమాంబ తాఁ
గాకలు దీరి, దాడి చని క్రమ్మిన యాదవరాజుసేనఁ జీ
కాకొనరించుచున్ దరిమి కాంచి జయమ్మును స్వీయనామకా
నేకపురంబులన్ నిలుప నెక్కొను రుద్రవరమ్ము నెంచెదన్.

## సర్పంచు శ్రీ వంజారి రాములుగారి ప్రశంస :

ఉ. వీరుఁడు కార్యశూరుఁడును విశ్రుతదాన దయాది సద్గుణో
దారుఁడు ధర్మవర్తనుఁడు దాతయు నేతయు దీన మానవో
ద్ధారుఁడు సాహితీప్రియుఁడు ధన్యుఁడు రుద్రవరాధినేత వం
జారి సదన్వయాబ్ధిశశి సత్కృతి రాములుఁ బ్రస్తుతించెదన్.

## శ్రీ గట్టుపల్లి సత్యనారాయణగారి ప్రశంస :

ఉ. హాయిగ నందసాగరము నందు విహార మొనర్పఁ జేయు ది
వ్యాయతసత్కవిత్వములు, అచ్చపుఁ బాండితి, పుణ్యవర్తనల్
న్యాయవిధి వ్యవస్థ యలరారెడు ఎట్టుపరాజు సత్యనా
రాయణరాజసత్కవికి రంజిలి యంజలి గూర్తుఁ బ్రేమతో.

## శ్రీ మామిండ్ల రామగౌడుగారి ప్రశంస :

చ. సహృదయ శేఖరుండు విలసన్నవ భావకవిత్వవారుణీ
విహరణ తత్పరుండు సుకవిప్రతతి ప్రణుతస్వభావుఁ డ
చ్ఛహిత గుణవ్రతుండు ఘనసారసుకావ్యరసైకపాయి స
ద్విహితవినీత వర్తనుఁడు విశ్రుతుఁ డాప్తుఁడు రామగౌఁడు తాన్.

## దత్తపది :

ఇల్లు, ముల్లు, కల్లు, చొల్లు - విరాటపర్వ కథలో.

ఉ. ఇల్లు సమస్తపాపముల కెంతయు ధూర్తుఁడు కీచకుండు తా
ముల్లుగ నిక్కి ద్రౌపదిని మోహముతోఁ గవయంగఁ బూని బల్
కల్లుకు వచ్చినట్టి సతి గాంచి కరమ్మును బట్టి నెట్టి వా
చొల్లు స్రవించఁ గూల్చి చనె సుందరి యుద్ధతి రాట్సభాస్థలిన్.

## సద్యోవర్ణన :

మూన్నాళ్ళలోనే మంత్రిపదవులు కోల్పోయినవారి దుస్థితి అపహాస్యభాజనమైనదానిని వర్ణించుట.

ఉ. దట్టములైన మొక్కలను దప్పక పీఁకెడు రైతు పోలికన్
మొట్టమొదల్ పదమ్ము లిడి మూఁడుదినాలకె నెట్టి వేసె హా!
యెట్టులొ ముందు దుర్గతి యిఁకేమి యుపాయ మటంచుఁ బిచ్చిగా
నట్టిటు పర్వులిడిరి మహాత్వర లోకులు చూచి నవ్వఁగన్.

## సమస్య :

గజగామిని నన్ను జూచి గజగజ వడఁకెన్.

క. త్రిజగత్సుందరిఁ గని నే
నిజముగఁ బిచ్చెక్కి దాని నెర జేరఁగఁ బో
రుజ యేమో యసురుం డని
గజగామిని నన్ను జూచి గజగజ వడఁకెన్.

## నిషేధాక్షరి :

క. ఘోషను మదిలో వెత కడు
ఘోషింపన్ గాన కరిగి గోనందంబున్
బోషింప బుద్ధుఁడు గయన్
భాషించెను సిద్ధిపొంది పరమార్థంబున్.

ఘోషను = అంతఃపురములో (ఘోష హిందీ పదము)

ఆత్మీయులు, సహృదయ విద్వత్కవివరేణ్యులు, తెలుగు పండితులు శ్రీ మామిండ్ల రామగౌడుగా రేర్పాటు చేసిరి. సభకు కోరుట్ల జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్, సుకవివర్యులు శ్రీ గజ్జెపల్లి (ఎఱ్ఱప రాజు) సత్యనారాయణరాజుగా రధ్యక్షత వహించిరి. సర్పంచు శ్రీ వంజారి రాములుగారు సహకరించిరి.

# ఆదిలాబాదు

తేది : 26.7.1981

## ఆదిలాబాదు ప్రశంస :

ఉ. మేదిని నాంధ్రభూరమకు మేలిమిగా మకుటాయమానమై
పాదుగ గౌతమీవిమలవారితరంగితతారహారమై
మోదకవన్యసంపదల భూరియశమ్మును గన్న ఆదిలా
బాదును నన్నవస్త్రముల పాదును సాదు నుతింతు నెంతయున్.

## ఆరోగ్యశాఖా ప్రశంస :

శా. సారోద్యత్పురుషార్థసాధనపటిష్ఠంబై సుఖావాప్తి కా
ధారంబై హృదయప్రశాంతి కిరవై ధన్యంబు గావించు ర
మ్యారోగ్యంబు నెసంగఁ జేసెడి ప్రశస్తారోగ్యశాఖన్ దయా
పారావారసురేఖ నెంచెద మహాభాగ్యంబు యోగ్యంబుగాన్.

## దత్తపది :

పేద, బాధ, రోద, గాధ - కుచేలుని ప్రసక్తితో కుటుంబ సంక్షేమము గురించి.

ఉ. పేద లనేకపుత్రులను బిట్టుగఁ గాంచిన సౌఖ్య మబ్బునే
బాధలు కాక, శాంతి యొక పట్టునఁ గల్గునె మున్ గుచేలు వెన్
రోదన విన్నదే కద! హరోం హర యంచు కుటుంబభారపున్
గాధల నెంచి తన్మితియె కార్య మటంచుఁ జరింపఁగా వలెన్.

సద్యోవర్ణన :

చరిత్ర కెక్కని ఆదిలాబాదులో క్రొత్తవారికి కన్పడు విశేషముల గురించి.

ఉ. వాదము లేదు భేదము లవారితమై కనరావు, విద్యకున్
బాదులు తీసి నాగరికవైభవ మొప్పని దివ్యసంస్కృతిన్
మోదముగూర్చు చాటవికముగ్ధల రమ్యవిలాసశోభియై
ఆదిలబాదు కన్పడు నవాగతదృష్టి విలక్షణమ్ముగన్.

సమస్య :

కడు పుబ్బఁగ నవ్వ దాన గర్భం బాయెన్.

క. కడు వలపు చెలఁగు చెలువుఁడు
పడతిన్ గొని పెక్కుగతుల భావజకేళిన్
బడి గిలిగిలి చేయ నలరి
కడు పుబ్బఁగ నవ్వ దాన గర్భంబాయెన్.

నిషేధాక్షరి :

వాసర సరస్వతి గురించి.

క. కైతలఁ గొల్వన్ విద్యల్
చేతో హృష్టిగను నిచ్చి శ్రీధీసంపత్
ఖ్యాతి గలిగించు వాసర
భూతల వాగ్దేవి భక్తము క్తిప్రదయై.

ఆరోగ్యశాఖవా రేర్పాటు చేసిరి. జిల్లా కలెక్టరు సభ కధ్యక్షత వహించిరి. మాన్యులు, విద్వద్వరేణ్యులు, ప్రముఖ రచయితలు శ్రీ సామల సదాశివగారు పరిచయ ప్రసంగం చేసిరి.

# శ్రీ జగదీశ్వరాశ్రమము – తక్కళ్ళపల్లి

(కరీంనగర్ జిల్లా)    తేది. 29-6-1988

ఆశ్రమప్రశంస :

సీ. శ్రీ నిర్గుణ ప్రకాశానందగిరి శుభా
    శీస్సుధాధారాభిషేకితంబు
సద్గుణమణి బ్రహ్మచారి రాజయ రాజ
    యోగిసంస్థాపిత యుక్తభూమి
తక్కళ్ళపల్లి భక్తశిఖామణుల కృషి
    ఫలవంత మైనట్టి వరవనంబు
నిత్యజపధ్యాననిష్ఠాభిశోభిత
    శాంతాలవాల సజ్జన నిలయము

గీ. పుష్పఫలవృక్షభరితమై పొంపు లొలికి
పూతస్రోతస్వినీతటంబునను వెలసి
దూరతీరయాత్రికమనోహరి యగుచు
తనరు జగదీశ్వరాశ్రమంబును నుతింతు.

సభకు విజ్ఞప్తి :

క. చిరకాల మాయె నవధా
నరథంబును నడపకునికి నా హితులారా!
వరుసన్ దప్పక చక్కని
నరణిన్ సాగించు భరము సరసాత్ములదే

**దత్తపది :**

బృందా, నందా, విందా, వందే - జగదీశ్వరాశ్రమ వర్ణన.

శా. బృందాపావనభూమియై నిరతసద్విద్యావిచారాత్తమై
నందాత్మన్ వసియించు భక్తులకుఁ బూర్ణజ్ఞానమున్ గూర్చి గో
విందారాధన భుక్తిముక్తు లిడుచున్ వెల్గొందు క్షేత్రంబునున్
వందేహమ్మని కొల్తు నాశ్రమము సద్భావమ్ముతో సర్వదా.

**సద్యోవర్ణన :**

సభ సాగుచుండ వాన వచ్చినచో పరిస్థితి.

మ. శుభమా యంచు వధానకార్యనిరతిన్ శోభిల్లుచుండంగ హా
సభ మీర్ష్యం గొని యేడ్చె నన్న గతి వానన్ బెల్లు వర్షించినన్
సభ గగ్గోలయి యందు నిందు జనముల్ నానాత్వరాందోళనన్
ప్రభువా! యంచుఁ గుటీర సన్నిధులకున్ బర్వెత్తరే దుస్థితిన్.

**సమస్య :**

మూఁడున్ మూఁడును గూడి చూడఁగ వడిన్ ముప్పైన
మూఁడై తగున్.

శా. ఈడెం తైనను నేఁడు లెన్ని చనినన్ స్వేచ్ఛాసుఖా లొందినన్
ఏదేదైన జగంబు లేలినను సర్వేశుండుగా వెల్గినన్
పాడౌ కామముఖారి వర్గములఁ దాఁ బట్టంగ క్షేమంబె యా
మూఁడున్ మూఁడును గూడి చూడఁగ వడిన్ ముప్పైన
మూఁడై తగున్.

**నిషేధాక్షరి :**

కాషాయధ్వజ వర్ణన.

క.　　కావిన్ భూఖస్థంబై
శ్రీవిద్యన్ గూర్చి ముక్తిశ్రీనిడు శక్తిన్
భావమునఁ దలఁచి కొలిచెద
దేవతలకు దైవమైన దివ్య పతాకన్.

ఆత్మీయులు, ఆశ్రమ వ్యవస్థాపకులు శ్రీ బ్రహ్మచారి రాజయ్యగారేర్పాటు చేసిరి. మాన్యులు నాయకవరేణ్యులు శ్రీ మిరియాల కిషన్ రావుగారు సభ కధ్యక్షత వహించిరి.

# పిప్పెర

(నిజామాబాదు జిల్లా) తేది. 25-11-1988

## పిప్పెర ప్రశంస :

ఉ. గొప్పగఁ బాఁడిపంట లొనగూర్చుచు లక్ష్మికి శారదాంబకున్
మెప్పయి దానధర్మముల మించి పరాక్రమపౌరుషంబులన్
గుప్పుచు సద్యశం బడరఁ గ్రొంబసఁ బల్లెల మేలుబంతి యౌ
పిప్పెర గ్రామమున్ దలఁతుఁ బేరిమి కూరిమి సందడింపఁగన్.

## శ్రీ పి. రాజేశ్వర్‌గారి ప్రశంస :

క. తేజస్వియు విజ్ఞానియు
రాజద్గుణమణియుఁ గార్యరంగస్థలవి
భ్రాజియు నాచార్యుఁడునౌ
రాజేశ్వరు నిష్టమిత్రుఁ బ్రస్తుతి చేతున్.

## శ్రీ నాంపల్లి రమణయ్యగారి ప్రశంస :

సీ. వరవిద్యలన్ జగద్వ్యవహారముల యందు
సమముగాఁ జతురుఁడై సాగువాఁడు
విద్య చెప్పుటె కాదు విద్యాలయంబుల
పెంపుకై కృషిచేసి వెలయువాఁడు
ఉచితానుచితముల యోగ్యతాయోగ్యతా
తారతమ్యము గాంచి తనరువాఁడు
నియమనిష్ఠలు గల్గి నీతిరీతులు వెల్గి
ఔదార్యగుణముల నలరువాఁడు

గీ. భక్తివేదాంతవీధులఁ బరఁగువాఁడు
పరహితాచారవర్తన లరయువాఁడు
సరసమూర్తి సహాధ్యాయి సఖుఁడు నాప్తుఁ
డైన నాంపల్లి రమణయ్య నభినుతింతు.

దత్తపది :

చాముండ, సోముండ, ధాముండ, రాముండ-భారతార్థములో.

శా. చాముండాపతిఁ గూర్చి పార్థుఁడు తపశ్చర్యన్ విరాజిల్ల నా
సోముం డంతఁ గిరాతుఁడై చెలఁగి యచ్చో మెచ్చి యిచ్చెన్ దయా
ధాముం డస్త్రము, దానిఁ గాంచి వెలసెన్ ధాత్రీస్థలిన్ గృష్ణుఁడున్
రాముం డావిజయున్ నుతింపఁగ రణప్రాగల్భ్యధౌరేయునిన్.

సద్యోవర్ణన :

మార్కండేయుని ప్రశంస.

ఉ. శంకరు సద్దయన్ గలిగి స్వల్పపు టాయువు దీర్ఘ మౌటకై
శంకలులేక కొల్చి మునిసంగతి ఘోరతపంబు లెన్నియో
శంకరవిష్ణుమూర్తులకు సల్పి మహామునియై జగంబులన్
వంకలులేని ధర్మపథవర్తనుఁడై వెలసెన్ జిరంబుగన్.

సమస్య :

తొండం బెత్తి హసించె నారిఁ దునిమెన్ దోరంపు టీరంబుతో.

శా. చండంబౌ రణభూమిలో నరుఁడు దుష్టవ్రాతమున్ ద్రుంచుచున్
గాండీవంబున శత్రువీరతతులన్ ఖండమ్ములన్ సల్పుచున్
జెండాడెన్ బడఁ గూల్చె నశ్వములఁ గ్రుచ్చెన్ జావఁగా దత్కరుల్
తొండం బెత్తి, హసించె నారిఁ దునిమెన్ దోరంపు టీరంబుతో.

నిషేధాక్షరి :

గణపతి బొజ్జను వర్ణించుట.

క. కుండగ దండిత విద్వి
ణ్మండల! నీ బొజ్జ వెల్గు మాయయ్యా! వే
దండముఖా! దయ గనుమా
మండితసుగుణప్రకాండ! మహదేవసుతా!

ఆత్మీయులు, స్థానిక జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ప్రధానో పాధ్యాయులు శ్రీ నాంపల్లి రమణయ్యగారు అక్కడి పద్మశాలి సంఘమువారి సహకారముతో ఏర్పాటు చేసిరి. మిత్రులు, జూనియర్ లెక్చరర్ శ్రీ పి. రాజేశ్వర్‌గారు సభ కధ్యక్షత వహించిరి.

# కోరుట్ల

తేది : 22-12-1988

## శ్రీ దుర్గాదేవీ ప్రస్తుతి :

ఉ. చొక్కపు భక్తి సద్గురుని సూక్తులు చిత్తమునందు నిల్పి మా
జక్కుల శంకరయ్య నిజసద్మమునన్ నెలకొల్పఁ బొల్పుగా
మక్కువఁ గొల్చు భక్తులకు మందరమై వెలుఁగొందు
దుర్గనున్
దిక్కగు విశ్వమాతను మదిన్ భజియింతు శివాభిలాషినై.

## శ్రీ జక్కుల శంకరయ్య ప్రశంస :

సీ. శ్రీదుర్గపై భక్తి చెలఁగి నిత్యము నిష్ఠ
వెలయ నుపాసన సలుపువాఁడు
దైవజ్ఞమౌళియై తనరారి ధాటిగాఁ
బ్రశ్నలు చెప్పుచు వఱలువాఁడు
అర్థుల కార్తుల కదియిది యనకుండ
దానముల్ చేయుచుఁ దనుపువాఁడు
భోగియై త్యాగియై యోగియై పురుషార్థ
జీవనప్రభల రాజిల్లువాఁడు

గీ. రమణ "జ్యోతిషరత్నాకర" బిరుదమున
నెఱ "స్వరశ్వాసచింతామణి" ప్రథ నెగడఁ
బొగడ నెలవగు జక్కులపుణ్యవంశ
వార్ధిపూర్ణేందుశంకరున్ బ్రస్తుతింతు.

దత్తపది :

అమ్మ, బొమ్మ, గుమ్మ, కొమ్మ - రామాయణార్థములో.

ఉ. అమ్మ! మహీజ! రావణుఁ డహంకృతితో నిను దెచ్చె న్యాయ మా
బొమ్మకు లేదు, శీఘ్రముగ భూరిబలుం డరుదెంచి ముద్దులా
గుమ్మల భోగి రాక్షసుని గూల్చును జీల్చి శిరమ్ము లుగ్రుఁడై
కొమ్మల ఫ్రేల్చు నంచుఁ గపికుంజరుఁ డుద్ధతిఁ బల్కె సీతతో.

సద్యోవర్ణన :

భర్తకు తెలియకుండ తిరుమలేశునికి తల నీలాలిడి వచ్చిన భార్యను జూచిన భర్త మనస్థితి.

మ. తల నీలా లిడి వచ్చినట్టి వనితన్ దాఁ జూచి నాథుండహో!
కలయా? వైష్ణవమాయయా? చెలియ! యీ కార్యం బదెట్లాయె? నీ
చెలువం బెచ్చటి కేగె నా వలపు లిస్సీ యేమి యౌనో కదే
బళిరా! నాకును క్షౌరమైన జతగా బైరాగులై పోదుమే.

సమస్య :

ఒక్కటి రెండు మూఁ డగుచు నొప్పఁగ నాలుగు నైదు నారగున్.

ఉ. తిక్కగ మానవుండు కడుఁ దీంద్రముగాఁ జెలరేఁగెనేని న
బ్బక్క! జనించుఁ గామ ముదయంబగు క్రోధము దాన లోభమున్
వెక్కగఁ బుట్టు పుత్రకుల వెంపున నొక్కట శత్రుసంహతుల్
ఒక్కటి రెండు మూఁడగుచు నొప్పగ నాలుగు నైదు నారగున్.

## నిషేధాక్షరి :

మహిషాసుర మర్దనము.

క. భూభీతి చల్పువాఁడా!
శ్రీ భూముల్ బ్రోచ నిన్ చిచీ! ద్రుంచున్ దా
నాభీలశూల మనుచున్
భూభారం బడప దుర్గ పొడిచెన్ మహిషున్.

ఆత్మీయులు, 'జ్యోతిష రత్నాకర' శ్రీ జక్కుల శంకరయ్య గారు స్వగృహములో ప్రతిష్ఠించిన శ్రీ దుర్గాదేవీ పంచమవార్షికోత్సవ సందర్భమున నేర్పాటు చేసిరి. మాన్యులు, కోరుట్ల పద్మశాలి సంఘాధ్యక్షులు శ్రీ ఎక్కలదేవి లక్ష్మణగారు సభ కధ్యక్షత వహించిరి.

# పోచంపాడు

(నిజామాబాదు జిల్లా)     తేది: 31-12-1988

**శ్రీరామసాగర ప్రశంస :**

మ. ధరణిన్ గ్రామసహస్రసస్యములకున్ దాహంబులన్ దీర్చుచున్
సిరులున్ సంపదలున్ జెలంగ సుఖశాంతిశ్రీలు వెంపొందఁగా
వరగంగాజలపూతమానవరుతిన్ భాసిల్లు శ్రీరామసా
గరమున్ గుండెల నింద నిల్పుకొని వక్కాణింతు
భద్రమ్ములన్.

**ఆశ్రమ పాఠశాలా ప్రశంస :**

ఉ. ఆశ్రితశిష్యకోటికి దయామృతవిద్యలు దారవోయుచున్
విశ్రమ మింతలేక ఘనవిజ్ఞులఁ జేయుచు సంతతంబు ము
న్యాశ్రమమై ప్రశాంతినిలయమ్మగు పోచమపాడులోని యీ
యాశ్రమపాఠశాల ననయంబు నయంబుగ సన్నుతించెదన్.

**దత్తపది :**

రదన, సదన, మదన, వదన - నరసింహస్వామి హిరణ్య
కశిపుని వధించిన ఘట్టములో.

చ. రదనములన్ గడుం గొరికి రాక్షసరాజును జీల్చఁ బూని తా
సదనము ద్వారమధ్యమునఁ జయ్యనఁ బొట్టను జీల్చి కూల్చి త
న్మదనముఖున్ గుమారకుని మన్ననఁ గాచియు చండభానువై
వదనము దోఁప నా నృహరి భక్తులఁ దప్పు శమించఁ డెంతకున్.

**సద్యోవర్ణన :**

పోచంపాడులోని రామలింగేశుని వర్ణన.

ఉ. నశ్వరభోగ మేలని యనారతభక్తి భజింప నెంచి యో
గేశ్వరు దీనరక్షకు నహీంద్ర విభూషణు భర్గు రామలిం
గేశ్వరుఁ దెచ్చి నిల్పిరి రహిన్ మన పోచమపాడునందు స
ర్వేశ్వర! దేవదేవ! కరుణించుము మమ్ముల నంచుఁ గొల్చుచున్.

**సమస్య :**

కాకుల గోలలే మనకుఁ గావలె నేఁటికి శ్రావ్యగీతికల్.

ఉ. లోకులు దుష్టులై వదరి లొంగిన వంగిన వారి నేఁచుచున్
భీకరతన్ సృజించెదరు వీరత శూరత యందు వెల్గునే
పోకిరి చేష్ట లేల శుభముల్ ప్రవచించు మహాత్ములైన యే
కాకుల గోలలే మనకుఁ గావలె నేఁటికి శ్రావ్యగీతికల్.

**నిషేధాక్షరి :**

శ్రీ వంగవీటి మోహనరంగారావు హత్యానంతరము ముఖ్య మంత్రి శ్రీ ఎన్.టి. రామారావు పరామర్శించుటకు వచ్చినప్పటి శ్రీమతి రత్నకుమారి మానసిక స్థితి.

క. భర్తన్ గక్షన్ గూల్చెన్
ఆర్తన్ దాఁ జూడ నేమి? ఆ దుర్వేధన్
గీర్తింప నేమి ఫల మని
ధూర్తున్ రత్నమ్మ కనక దూరె గృహమునన్.

పోచంపాడులోని బాలుర బాలికల ఆశ్రమ పాఠశాలలో సంయుక్తముగా అవధాన్య లేర్పాటు చేసిరి. ప్రధానాచార్యులు శ్రీ భూమ రెడ్డి సభ కధ్యక్షత వహించిరి. తెలుగు పండితులు శ్రీ వసంత రెడ్డిగారు నిర్వాహకులుగా ఉండిరి.

# కోరుట్ల

తేది. 4-1-1989

నిర్వాహక విద్యార్థులకు శుభాశీస్సులు :

మ. అమితంబౌ గురుభక్తితో సరసతాహ్లాదానురక్తిన్ మహో
ద్యమరీతిన్ స్థిరబుద్ధి విఘ్నముల ధైర్యస్ఫూర్తిఁబోఁద్రోచుచున్
విమలంబౌ నవధాన మేర్పరచి రీ విద్యార్థివిద్యార్థినుల్
ప్రమదాభ్యున్నతులున్ జయంబులును సంప్రాప్తించుతన్
వీరికిన్.

దత్తపది :

అప్పులు, చెప్పులు, నొప్పులు, పప్పులు-ముగ్ధమోహన సుందర వేణి వర్ణనలో.

ఉ. అప్పులు చేసి కొప్పిడిన యంగన సుందరవేణి నేమనన్
చెప్పులు వస్త్రధారణము చిన్నెలు వన్నెలు నింపు నింపఁగా
నొప్పులు కుప్పవోయు హొయ లొయ్యనఁ జూపు జడన్
గదల్చు చే
పప్పులు నుప్పులం చనదు భామిని యే మినితారయో కదా!

సద్యోవర్ణన :

పాల కేంద్రమును పేల్చవలదన్న వ్యక్తిని దుండగులు చంపగా విధవయైన అతని భార్య దురపిల్లిన విషయము.

ఉ. పిల్లలు త్రాగు పాలనిధి పేల్చఁగ వద్దని మాన్చు నాథునిన్
గొల్లు మనంగఁ జంపె నతిఘోరము, నా బ్రతు కుత్తదాయె నీ
పిల్లల కేమి యాదరువు పీడల నెట్లు భరింతు నంచుఁ దాఁ
దల్లడిలెన్ వినాథ వనితామణి జాలిగ నేడ్చు చార్చుచున్.

సమస్య :

వైఖరిదేమొ కాని మృగి వ్యాఘ్రముఁ జంపెను మూషికాసుషిన్.

ఉ. శాఖలఁ బూలు గోయు నొక సత్సతి దుష్టుఁడు పట్టఁ బోవఁగా
భీకరరూపి మెత్తి యొక పెట్టున వానినిఁ బట్టి యీడ్చుచున్
శాఖిని గల్గు కోటరము సందునఁ దన్నుచు జంపె బాపురే!
వైఖరిదేమొ కాని మృగి వ్యాఘ్రముఁ జంపెను మూషికాసుషిన్.

నిషేధాక్షరి :

సరస్వతీదేవి వర్ణన.

క. ధీ నిచ్చి శ్రీలు గూడం
గా నిచ్చుచుఁ దన్పుఁ గీర్తిగా మన్చున్ గీ
ర్వాణిఁ దగు వాణిఁ గొల్తు న
నూనజయంబుల నొసంగ నుత్సాహముతో.

కోరుట్ల ప్రభుత్వ డిగ్రీ కళాశాల విద్యార్థులు నిర్వహించిరి. కుమార్ తత్త్వాది ప్రమోద్‌కుమార్ పూనుకోగా, కు॥ వకుళాభరణం కృష్ణమోహనరావు, కు॥ తురగా శ్రీధరరెడ్డి, కు॥ గౌరినేని కృష్ణ మోహనరావు విశేష ప్రయత్నము చేసి, విజయవంతముగా నిర్వ హించిరి. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ వి. రామకృష్ణారెడ్డిగారు సభ కధ్యక్షత వహించిరి. ప్రియ సహోపన్యాసకులు, ముఖ్యముగా శ్రీ ధర్మా రెడ్డిగారు, శ్రీ బి. నారాయణరావుగారు సహకరించిరి. శాసన సభ్యులు శ్రీ శికారి విశ్వనాథముగారు, మండల ప్రజా పరిషత్తు అధ్యక్షులు శ్రీ సింగిరెడ్డి నారాయణరెడ్డిగారు, రాష్ట్రీయ స్వయంసేవక సంఘ ప్రముఖులు శ్రీ చిట్నేని విద్యాసాగరరావుగారు, మాజీ పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ మిరియాల కిషన్‌రావుగారు ముఖ్యాతిథులుగా పాల్గొనిరి.

# మన్నెగూడెము

(కరీంనగర్ జిల్లా) తేది. 9-7 1989

మన్నెగూడెము ప్రశంస :

సీ. బంగారు పంటలన్ వరసుధాసారముల్
క్షీరముల్ దధిఘృతాసార మొలుక
ప్రజ నేలు నేతలున్ బలు వన్నె నేఁతలున్
ఖ్యాతి గూర్చెడు నీతి చేఁత లదర
చిత్తరంజకములై చెలువు మీరెడు భాగ
వతమేళముల కీర్తి పరిమళించ
పూజ్యసత్యానంద పూత బోధనలచే
పారమార్థికరుచుల్ పరిఢవిల్ల

గీ. సరసులకు సుమనోమోద సంగతులకు
ముగ్గు రమ్మల దయలకు మురిసి మెరసి
మన్నె గుడమై విరాజిల్లు మన్నెగూడె
మను వినుతి చేతు సహృదయామోద మలర.

శ్రీ కైరంకొండ లక్ష్మీరాజముగారి ప్రశంస :

మ. సరసుండున్ గవివర్యుఁడున్ హితుఁడు సత్సాహిత్యపీయూష పా
నరతుండున్ సుగుణోత్తరుండు విమలజ్ఞానప్రసన్నుండు సాం
ద్రరుచిన్ సత్కళలన్ వెలార్చు శశి కైరంకొండ లక్ష్మీశుఁ డీ
వరమిత్రున్ నుతియింతు డెందమున శుంభద్భక్తి రంజిల్లఁగన్.

**దత్తపది :**

బొగ్గులు, ముగ్గులు, దగ్గులు, రగ్గులు - రామాయణార్థములో.

ఉ. బొగ్గులు చేసి మీ మెయులు భూరికళల్ చెలు వొంద నిండ్లలో
ముగ్గులు పెట్టి పండుగులు మోదముతోఁ బొనరించు కొందు రే
దగ్గులు దమ్ములున్ గనక ధాత్రిజనుల్ చరియింతు రంచు నే
రగ్గులు లేని రాఘవుఁడు రాక్షసులన్ దునుమాడి పల్కెఁ దాన్.

**సద్యోవర్ణనము :**

మన్నెగూడెము భాగవతుల ప్రస్తుత దైన్యము.

మ. ఒకనాఁ డెంతొ మహేంద్రవైభవమునం దోలాడుచున్ మేము తై
తకయంచున్ నటనం బొనర్చితిమి, అంతా సీనిమాల్ వచ్చి గ
వ్వకుఁ గాకుండ నడంగినా మయయొ మా బాధల్ కథల్ గాంచువా
రొకరున్ లేరు నటేశుఁడే గతి యటం చూరూర వాపోదురే.

**సమస్య :**

మామిడి చెట్టు కొమ్మకు టమాటలు కాచె నదేమి చిత్రమో.

ఉ. కోమలి! తోఁటఁ జేరితిమి కోరిక తీరఁ జరింతు మందువా?
సాములవోలె సేద్యమును సల్పుచుఁ జెట్లను బెంచుకొంటిమే,
ఏమని చెప్ప ముందె ఫలియించె, నుయేలను గట్టి యూఁగకే
మామిడి చెట్టు కొమ్మకు, టమాటలు కాచె నదేమి చిత్రమో.

**నిషేధాక్షరి :**

శోభనము రాత్రి వధూమనోభావము.

క. ప్రీయా యౌను భీ యవున్ నా
ప్రేయ మ్మేమౌనా చెల్వ్వ పెంపేదితినో
చేయఁ గల నేమి భర్తయె
నాయెడఁ గరుణించ వలయు నన్నేలంగన్.

కవివర్యులు, ప్రియమిత్రులు శ్రీ కైరంకొండ లక్ష్మీరాజముగారేర్పాటు చేసిరి. మిత్రులు, సహాధ్యాయి శ్రీ చెన్నమనేని హనుమంతరావుగారు సభ కధ్యక్షత వహించిరి.

# మోర్తాడు

(నిజామాబాదు జిల్లా)    తేది: 15-10-1989

**మోర్తాడు ప్రశంస :**

ఉ. పాఁడియుఁ బంటలున్ వివిధభాగ్యములున్ గళ లుల్లసిల్లఁగా
వాఁడిమి వేఁడిమిన్ జెలఁగి పౌరుషభోగము త్యాగ మొప్పఁగా
నాఁడును నేఁడు సద్యశమునన్ జెలువొందెడు వీడుతేఁడు మో
ర్తాడును వేడుకన్ దలఁతు ధన్యము పుణ్య మగణ్యమౌ పురిన్.

సీ. ఒకవంక కాసార మొకవంక పెద్దవా
గొకవంక మొండివా గురుకులెత్త
ఒకవైపు వరిచేలు నొకవైపు తోఁటలు
పచ్చపచ్చగ నెదల్ మెచ్చు లీన
ఒకదిక్కుగా రెడ్డియొడయలు పాలింప
నొకత్రొక్కుగా స్వామి యుద్ధరింప
ఒకచెంత నేఁతలు నొకపొంత రైతులు
వివిధవృత్తుల జనుల్ వెలయుచుండ

గీ. ఒక్కయెద బడుల్ గుడులు తా మొక్కదెసను
ఒక్కచెంత విపణివీధు లొకట సాధు
లివియవి యటంచుఁ బేర్కొన నేల సకల
మోదముల పాదు సుమ్మి! యీ మోరుతాడు.

సీ. ఈయూరి యందె బీఓయలు పొసయి
తెలుఁగు పండితుఁడనై తేజరిలితి
ఇచటనే 'గాయత్రి' హితవుగా నుపదేశ
మంది యుపాసించి యలరియుంటి
ఇక్కడనే దీక్ష నేగి ఆర్యసమాజ
సత్సంగముల గోష్ఠి సలిపియుంటి
ఇచటనే వరదార్యప్రచురసత్కావ్యగా
నమును సన్మాన మొనర్పఁ గంటి

గీ. ఇచట శిష్యులు భక్తి సేవింప నుండి
ఇచటి పెద్దల యాదర మ్మొనసి మంటి
ఇచటి మిత్రుల యనురాగ మెసఁగఁ గంటి
ఇట్టి మోర్తాడు నెటు విస్మరింతు నేను.

దత్తపది :

ఉష్ట్రిము, భ్రాష్ట్రిము, రాష్ట్రిము, లోష్టము విజయ విలాస వర్ణనలో.

ఉ. ఉష్ట్రిములన్ హయాదులను నుద్ధతవీరుల గుంపు వీడి బల్
భ్రాష్ట్రిముతో వెలుంగుచు సుభద్రను గూడి మనోజలీలలన్
రాష్ట్రిము లన్నియున్ దెలియ రంజిలెఁ బార్థుఁ
డమూల్యహేమమున్
లోష్టముగాఁ దలంచు యతిలోపలి తత్త్వము వేషకల్పమై.

సద్యోవర్ణన :

రామజన్మభూమి వివాద పరిష్కార పరిణామము గురించి.

ఉ. రాముని జన్మభూమి యయి క్రాలు నయోధ్యను
మందిరమ్ము పెన్
ధామముఁ గట్ట హిందువులు ధాటిగ నిల్చిరి హైందవేతరుల్
భీమముగా నెదిర్చినను వీడక పట్టును భీతి నొందకన్
ధీమహితుల్ జగద్ధితము తెన్నునఁ గార్యజయంబు గాంచరే.

సమస్య :

శ్రీనాథుని కడుపులోన జీసెస్ పుట్టెన్.

క. తానెంత పుణ్యవతియో
మానిని మరియమ్మ దైవమహిమను, గూడన్
గానక మునుపే భాగ్య
శ్రీనాథుని, కడుపులోన జీసెస్ పుట్టెన్.

నిషేధాక్షరి :

స్థానిక శ్రీ వేంకటేశ్వరస్వామి స్తుతి.

క. శ్రీభూదీ లియ్యంగాఁ
దా భీష్మత నేల భూతిదం బౌ నాథన్
శ్రీభూపతి వెలసెను ఘన
శోభల మోర్తాడు నందు శుభదాయకుఁడై.

ఆత్మీయులు, సరసోదార హృదయులు శ్రీ నందగిరి కాంతయ్య గారు, శ్రీ జక్కని రామచంద్రము గారు, శ్రీ చిలివేరి గంగారాము గారు మున్నగువా రేర్పాటు చేసిరి స్థానిక సర్పంచ శ్రీ సుభాస్‌చందర్ రెడ్డిగారు సభ కధ్యక్షత వహించిరి. రూ. 1016/- లతో ఘనంగా సన్మానించిరి.

# కోరుట్ల

(కరీంనగర్ జిల్లా)  తేది. 25-10-1989

## శ్రీ పాలెపు రాజేశ్వరశర్మ ప్రశంస :

ఉ. ఈశ్వరభక్తి, జోతిషము, ఇద్ధకవిత్వము ప్రజ్వరిల్లఁగా
నశ్వరభోగకాంక్ష విడి నందముగా గుణరత్నశోభియై
శాశ్వతకీర్తికై తపము సల్పు కొరుట్ల పురోహితుండు రా
జేశ్వరశర్మసత్కవి నభీష్టముతో వినుతింతు నెంతయున్.

## శ్రీ యెలిగేటి లింబాద్రి ప్రశంస :

క. హితుఁడగు లింబాద్రికి స
న్మతులైన రెవెన్యుశాఖ మాన్యుల కీ స
న్మతి కభివాద మొనర్చెద
వితతవధానమ్ము జరిపి వెలయుట కతనన్.

## దత్తపది :

మూత్రము, గోత్రము, గాత్రము, ఛాత్రము - ద్రౌపదీ వస్త్రాపహరణములో.

ఉ. మూత్రము గార్చఁ జేయఁ గల భూరిభయంకరభర్త లుండఁగా
గోత్రము కీర్తి దూలఁ గడు ఘోరముగా ద్రుపదాత్మజాసతిన్
గాత్రము నొవ్వ వస్త్రముల గాసిలి యీడ్చుచు నొంచ, భక్తిమత్
ఛాత్రము నెంచి కేశవుఁడు చానకు మానముఁ గాచెఁ బెన్ గృపన్.

సద్యోవర్ణన :

శ్రీ వకుళాభరణం జగన్మోహనరావుగారు తన జన్మదినోత్సవ సందర్భమున కోరిన శుభాకాంక్ష.

ఉ. మోహనరూపదుర్గ కడు మోదముతోఁ గరుణించి మా జగ
న్మోహనరావు జన్మదినమున్ గొని పుత్రకళత్రయుక్తిగా
నోహో యనంగ శ్రేయముల నొద్దికతోడ నొసంగి ప్రోచుతన్।
మోహనసత్కళాలతల ముద్దుగ నీతఁడు పెంచుఁ గావుతన్।

సమస్య :

రావణుఁ దల్చు సీతఁ గని రాముఁడు పొందెను సంతసమ్ములన్

ఉ. రావణు కారలోఁ బడియు రాగము నొందక రోషచిత్తయై
పావనశీల రాక్షసుని భ్రష్టుని దూషణ చేయుచుండెఁ దాఁ
బావని తోడుతో రిపుల భంగ మొనర్చి తనన్ సురారివి
ద్రావణుఁ దల్చు సీతఁ గని రాముఁడు పొందెను
సంతసమ్ములన్.

నిషేధాక్షరి :

ముందుగా ఎన్నికల ప్రకటన శ్రీ రాజీవ్ గాంధీ చేయించగా శ్రీ ఎన్. టి. రామారావు తలపోసిన విషయము.

క. ముందే ఏలా ఘోరతఁ
బొందెన్ దీ యున్నె పాలు పోదె నెగ్గన్
సందేహమె రాజీవుని
డెందం బెన్నికల నెట్లొ డీకొన వశమే.

సత్కవి, పురోహితుడు ప్రియమైన శ్రీ పాలెపు రాజేశ్వరశర్మ, సరసోదారహృదయులు - ప్రియమైన శ్రీ యెలిగేటి లింబాద్రి - కోరుట్ల మండల రెవెన్యూ గోడౌన్ అధికారిగా రేర్పాటు చేసిరి. స్థానిక ప్రభుత్వ డిగ్రీ కళాశాల ప్రిన్సిపాల్ డా॥ వి.రామకృష్ణారెడ్డిగారు సభ కధ్యక్షత వహించిరి.

# హొసకొత్తూరు

(నిజామాబాదు జిల్లా)     తేది: 8-11-1989

**హొసకొత్తూరు ప్రశంస :**

శా. సారోత్కృష్టఫలంబు లిచ్చు వరకాసారంబులున్ దివ్యకే
దారంబుల్, సముదాత్తనాయకులు, విద్యాసత్కళాచాతురుల్
వీరుల్ ధీరు లుదారు లొప్పఁగ మహిన్ వెల్గొందు ఈ హొసకొ
త్తూరున్ హొసవికాసచారు మన సెంతో పొంగ వర్ణించెదన్.

**విజేత యువజన కళాసంఘ ప్రశంస :**

గేయము :

గ్రామగ్రామణి, ఘనగుణమణిఖని,
అమృతరస మూరు, హొసకొత్తూరు
నందు విరాజిలు నతులితసంఘము
సరసోదారత సాగు సంస్థ యిది
విజేతయువజనకళాసంఘ మిది
ప్రజాసేవలో ప్రగతి గాంచినది.
అష్టావధానకార్యక్రమము వి
శిష్టముగా నిర్వహించుచున్నది
సన్మతి నను సత్కరించుచున్నది
సహృదయసుహృదయసభ్యుల నెసగును
విజేత యువజన కళాసంఘముకు
విజయాభ్యున్నతి వెలయును గావుత!

**శ్రీ నింబగిరి నరసింహస్వామి స్తుతి :**

క. శ్రీమన్నింబగిరిన్ భూ
క్షేమ మ్మారయుచు వెలసి చెలఁగెడి దయతో
కామితముల నిడి భక్తుల
నోమెడు నరసింహుఁ దలఁతు నురుతత్పరతన్.

**దత్తపది :**

ఖేద, భేద, మోద, ఛేద - సీతారాముల దాంపత్య మహిమ
వర్ణించుట.

చ. నిరతము ఖేద మొందియును నిస్తుల శీలముతో మెలంగుచున్
పొరయక భేదభావమును బొల్తుక జానకి రామచంద్రునిన్
మరువక కొల్చె మోదమున, మాన్యుఁడు రాముఁడు వీరవర్యుఁడై
చెర విడిపించె రాక్షసుల ఛేదన చేసి మహీజ నెంతయున్.

## సద్యోవర్ణన :

సంస్కృత పంచమహాకావ్యములను ప్రస్తుతించుచు ఉత్పల మాలలో.

ఉ. కమ్మని మేఘదూతమును గ్రమమునౌ రఘువంశ కావ్యమున్
బమ్మకు రాని భారవియు బమ్మెర గూర్చెడు మాఘకావ్యమున్
దిమ్మనఁ జేయు నైషధము ధీయుతు లిచ్చఁ బఠించి రేనియున్
సమ్ముద మొప్పఁ బ్రాజ్ఞులయి సన్నుతి సత్కృతిఁ గాంచ
కుందురే

## సమస్య :

సీతకు రాఘవుఁడు పుట్టి శివధను వెత్తెన్.

క. ఖ్యాతిగ భూజనములు ని
ర్భీతిగ విహరింప దనుజపీడ లణఁచ సా
కేతాధిపునికిఁ బ్రేమన్
సీతకు రాఘవుఁడు పుట్టి శివధను వెత్తెన్.

సీతకు=సీతాదేవి కొఱకు.

## నిషేధాక్షరి :

హనుమంతుని తోక వర్ణన.

క. భీదం బై రక్షోఘ్నత
మోదాబ్ధిన్ దేల్ప జగతిఁ బ్రోపన్ దోఁకన్
మీదికి లేపుచు మారుతి
మేదిని కంపించ దురము మేకొని చేసెన్.

విజేత యువజన సంఘము హొసకొత్తూరు సభ్యులు, కోరుట్ల డిగ్రీ కళాశాలలో చదువుచున్న నా విద్యార్థులు కుమార్ భీష్మగౌడు, కుమార్ కంచి తిరుపతి ఏర్పాటు చేసి, ఘనసన్మానము చేసిరి.

# కరీంనగరము

తేది. 5-1-1990

**కళాశాల ప్రశంస :**

సీ. శ్రీరాజరాజేశ్వరోరుకారుణ్యామృ
　　తాసార సంవర్ధితాయతంబు
బహుకళా విజ్ఞాన బంధుర శాఖోప
　　శాఖా కుసుమఫల శ్యామలంబు
విద్యార్థి శుకపికాపేక్షా సమాస్వాద
　　నా హర్షకలిత కోలాహలంబు
విద్వద్వరాచార్య హృద్వ్యత్రృబోధ స
　　త్కృషిపాలన ప్రభోద్దీపితంబు

గీ. విబుధకవినటగాయకప్రీణకంబు
అఖిలపోషక సుజన సిద్ధాశ్రమంబు
కరినగర నందనోద్యాన కల్పకంబు
పట్ట విద్యాలయంబును బ్రస్తుతింతు.

**దత్తపది :**

గ్రీష్మము, గ్రీష్మము, భీష్మము, ఊష్మము - ఋతువర్ణనలో.

ఉ. గ్రీష్మములోన భాస్కరుఁడు ఖేదముగా నెరియించుచుండు నా
గ్రీష్మము పోవ వానపడి కేకులు ముద్దుగ నాట్యమాడు పెన్
భీష్మముతోడఁ గర్షకులు వెల్లుగ సేద్యములన్ బొనర్తు రా
ఊష్మము కోస మాలుమగ లొప్పుదు రైక్యత శీతవేళలన్.

**సద్యోవర్ణన :**

పౌష్యలక్ష్మి వర్ణనము - మత్తేభములో.

మ. దినరా జుత్తరదిక్ప్రయాణ మగుటన్ దేదీప్యమానంబుగా
జనముల్ చిత్తము లుల్లసిల్లఁగఁ గడున్ సంక్రాంతి పర్వాహమున్
వనితల్ ముగ్గులు దీర్చ ధాన్యముల సంపద్వైభవోపేతమై
తనరన్ బాంధవమిత్రసన్మతుల నుత్సాహింతు రోహో! యనన్.

**సమస్య :**

భర్తను వధియించ వనిత బంధము వీడెన్.

క. ధూర్తుఁ డగు జారపురుషం
డార్తిన్ గను సతిని బలిమి నాకర్షింపన్
భర్త కని దుష్టుఁ డగు పర
భర్తను వధియించ వనిత బంధము వీడెన్.

**నిషేధాక్షరి :**

అష్టావధానపు కష్టవిశిష్టతల వర్ణన.

క. క్లేదయుతకర్మ చిత్ర
మ్మా దైవం బోముఁ గాక! యగునే సల్పన్
మోదావహమ్ము నీశ్ర్వ
సాద మ్మవధానవిద్య సరసాత్ములకున్.

ప్రభుత్వ శ్రీ రాజరాజేశ్వర డిగ్రీ కళాశాల - కరీంనగర్ వారు కళాశాలలోని విశ్వనాథ సభామండపములో ఏర్పాటు చేసిరి. కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఎం. నరసింహారావుగారు సభ కధ్యక్షత వహించిరి

# హైదరాబాదు

(ఆకాశవాణి) తేది. 22-4-1990

**ఆకాశవాణి స్తుతి :**

క. సకలామోదక కళలను
ప్రకటిత మొనరించు శాస్త్రభానుప్రభలన్
వికసించు హృదయజలజము
లకళంకాకాశవాణి నభినుతి చేతున్.

**దత్తపది :**

శక్తి, రక్తి, భుక్తి, శుక్తి-ఇప్పటి సమాజము గురించి.

ఉ. శక్తిని దాఁచి కార్యములు సల్పుచుఁ బెద్దఫలంబు గోరుచున్
రక్తిని భోగభాగ్యముల రంజిలుచుందురు నేఁటి మానవుల్
భుక్తికె కాని ముక్తికయి పూనిక కన్పడ దేమి చిత్రమో
శుక్తిని మౌక్తికం బటుల శోభిలఁ బుట్ట రెవార లారయన్.

**సద్యోవర్ణన :**

హుసేన్ సాగరములో ఇటీవల పడిపోయిన బుద్ధవిగ్రహ పరిస్థితి.

ఉ. పూనిక బుద్ధవిగ్రహము భూరి హుసేన్‌చెరు వందు నిల్పఁగా
హానిగ నీటిలో దొరలె నామహనీయుఁడు నిర్వికారుఁడై
గ్లానిని జెందఁబోఁ డయినఁ గాంక్షమెయిన్ శిలపై వెలుంగఁగా
మానవులన్ ప్రభావితుల మంచిగఁ జేయఁ దలంచు
నెంతయున్.

సమస్య :

పందికిన్ బుట్టెఁ జక్కని పాఁడి యావు.

తే. గీ. పల్లెవాఁ డావులన్ మేలి పందిగములఁ
బెంచి పోషింప నొకనాఁడె విస్మయముగ
ఆవుకుం బుట్టె నొక పంది యసహజముగ,
పందికిన్ బుట్టెఁ జక్కని పాఁడియావు.

నిషేధాక్షరి :

ద్రౌపది గురించి.

క. అరి నొంప నల్గి పతి చే
నరిఁ గూల్పన్ నల్పి వెలసె నా ద్రౌపది, ము
ష్కరులకు దుర్గతి, సన్మతి
నరులకు సద్గతి యొదవుట న్యాయము కాదే!

ఛందోభాషణము :

ప్ర. రాజకీయాలలో రాణింతు రెవ్వరు?
ఉ. ధైర్యసాహములఁ దగులువారు.
ప్ర. నాలుగు వంద లేఁడు లయినన్ నగరంబును బాగుచేయరా?
ఉ. నాలుగు వేల యేఁడు లయినన్ సరియౌనె ప్రబుద్ధనేతలన్.
ప్ర. కల మది పేరు రాజునకె కత్తిదె రాజ్యము....
కలము బలీయమై చెలఁగి కత్తిని మించిన సంతసించెదన్.

శుభాశంస :

తే.గీ. తెలుఁగులో నపురూపమై వెలసియున్న
విలసితాష్టావధానమ్ము నలిసినాఁడ,
సరసకవిపండితావళి సంతసమ్ము
నంది యభ్యుదయములతో నలరుఁగాక!

ఆకాశవాణి-హైదరాబాదు కార్యక్రమ నిర్వాహకులు, మాన్యులు, సహృదయ విద్వద్వరేణ్యులు డా॥ పాలకుర్తి మధుసూదనరావుగా రేర్పాటు చేయించిరి.

## పూనా ఆంధ్ర సంఘము ప్రశంస :

తే.గీ. దూరతీరాల ఆంధ్రుల చేరఁ దీసి
కవికళాకారపండితగణముఁ బిలిచి
సన్మతిన్ సన్మతి యొనర్చు సరవిఁ బూన
ఆంధ్రసంఘంబు మనసార నభినుతింతు.

## శ్రీ మిట్టపల్లి శంకరుగారి ప్రశంస :

ఉ. దక్షుని శ్లాఘనీయగుణధాముని సాంఘికరాజకీయహ
ర్యక్షము సంతతార్తిజనరంజకు శ్రీమదుదారచిత్తునిన్
దీక్షమెయిన్ గళల్ నెగడఁ దీర్చు రసజ్ఞుని ఆంధ్రసంఘ మ
ధ్యక్షుని మిట్టపల్లిప్రథితాన్వయశంకరు సంస్తుతించెదన్.

## దత్తపది :

పూన, లూన, గాన, దేన - కర్ణుని కవచకుండలాల ప్రదానము గురించి.

ఉ. పూనరె శత్రు మర్దనకుఁ బూర్వపు రాజులు కర్ణుఁ డట్లె మే
లూనఁగఁ బార్థుఁ జంపుటకు నుండఁగ నింద్రుడు వచ్చి
వేఁడినన్
గానక వెన్క ముందుఁ దన కాయముఁ గాఁచెడు కుండలంబులన్
దేనను భద్రమై వెలయు ధీరత నా కవచంబు నిచ్చె తాన్.

## సద్యోవర్ణన :

కాశి కళ పోయినది. మధురలో మస్జిద్ కట్టబడినది. శివాజి లేకపోతే అందరికీ సున్నతు చేయబడెడిది - ఈ మాటలను రూఢి పరచుచు చెప్పవలెను.

చ. కరకు తురుష్క ముష్కరు లఖర్వపు గర్వముతోఁ జెలంగి మం
దిరములఁ గూల్చుచున్ మతముఁ ద్రెళ్ళఁగ జేయుచుఁ జెల్ల
రేఁగఁగా
వరముగ ధర్మరక్షకు ప్రాతిగఁ బుట్టి శివాజి శత్రు భీ
కరరణముల్ పొనర్చి భువిఁ గ్రాలెడు రాజ్యము నిల్పెఁ
బొల్పుగన్.

సమస్య :

సీతకు శంకరుఁడు బుట్టి శివధను వెత్తెన్.

క. భీతిలు జగములఁ గావఁగ
ఖ్యాతిగ ధర్మంబు నిలుపఁ గమలాక్షుఁడు సా
కేతప్రభువునకు రాముఁడు
సీతకు శంకరుఁడు పుట్టి శివధను వెత్తెన్.
సీతకు=సీతాదేవికొఱకు; శంకరుఁడు=శుభకరుఁడు.

నిషేధాక్షరి :

శివకల్యాణ ఘట్టమును వర్ణించుట.

క. శ్రీదమ్మో పెండ్లిన్ సా
రోదంచత్పుత్రుఁ గాంచ నుమ జేజే యం
చాదృతి సురలు నుతింప మ
హాదేవుఁడు చేకొనెన్ నయప్రణయములన్.

పూనా ఆంధ్ర సంఘమువా రేర్పాటు చేసిరి. ఆంధ్ర సంఘము అధ్యక్షుడు, నా ప్రియమైన అల్లుడు శ్రీ మిట్టపల్లి శంకరుగారు, ఆంధ్ర సంఘం కార్యవర్గ సభ్యులు, ప్రియమిత్రులు డా॥ పిన్నమశెట్టి అనంతం గారు, శ్రీ కాచెర్ల దేవయ్యగారు ప్రత్యేక కృషి చేసిరి. రూ. 1116/లు, శాలువ సమర్పించి ఘన సన్మానము చేసిరి.

# వేల్పూరు

(నిజామాబాదు జిల్లా)　　తేది : 9-4-1992

**వేల్పూరు ప్రశంస :**

మ.　వరవిద్యామృతపానమత్తవిబుధుల్ భాసిల్లఁ గల్పంబులన్
గర మీయం గల వృక్షముల్ వెలయఁగాఁ గాంక్షావళిన్ దీర్చు బెం
ధురగోవ్రాతము కామధేనుతతియై తుష్టిన్ విరాజిల్లఁగా
వెలుఁగే శ్రీలును సౌఖ్యముల్ చెలఁగు నీ వేల్పూరు వేల్పూరనన్.

క.　సోల్పుల మేడలతోఁ బ్రథ
నిల్పెడు పురుషార్థములను నెగడుచుఁ జెన్నై
పొల్పూరు పురవరమ్మును
వేల్పూరు నుతింతు నెడఁద విప్పారంగన్.

**శ్రీ తంగుడిగె నరసింహశాస్త్రిగారి ప్రశంస :**

క.　సారమతులు గీతాలం
కారులు తంగుడిగె వంశ కంథిశశాంకుల్
ధీరులు సుగుణోదారులు
వారల నరసింహశాస్త్రి వర్యుల నెంతున్.

**దత్తపది :**

రాముడు, లక్ష్మణుడు, భరతుడు, రావణుడు - ఈ పదాలతో భారతార్థమున.

ఉ.　రాముఁడు మైత్రితో సుతను రాజస మొప్పఁగఁ బెండ్లిచేయఁగాఁ
బ్రేముడి లక్ష్మణున్ బిలువ భీతిలి యా శశిరేఖ చింతిలన్
రామను వల్చి యాభరతరాజసుతుండు వివాహమాడె నౌ
రా! మను వౌనె ప్రేమరహితాసురరావణదుష్టచేష్టలన్.

## సద్యోవర్ణన :

ఆధునిక రాజకీయ నాయకులలో నహుషుని గురించి.

ఉ. ఎవ్వరి తోడుచేఁ బదవు లెక్కి విభుండయి తేజరిల్లెనో
యవ్వల వారలన్ విడిచి హంకృతి మీరి తిరస్కరించుచున్
నొవ్వఁగఁ జేయుచున్ జనులనోళ్ళను మూయుచు
దుష్టబుద్ధియై
నవ్వఁగఁ గూలఁడే నహుషనాయకుఁ డెంతటి శౌర్య
మొప్పినన్.

## సమస్య :

తొండఁ బెత్తి హసించ నారిఁ దునిమెన్ దోరంపు బీరంబునన్.

శా. చండావేశముతోడఁ దాటక త్వరన్ జంపంగ నేతేర రా
ముం డుత్త్వేరణ మౌనిచేతఁ గని యమ్మున్ మింట
సంధించి భూ
భాండం బెల్లఁ జలించఁ దాపసులు సంభ్రాల్పోవఁ దెల్లే న్గహో!
తొండం బెత్తి హసించ, నారిఁ దునిమెన్ దోరంపు
బీరంబునన్.

తెల్ల+ఏన్గు=ఐరావతము.

## నిషేధాక్షరి :

శ్రీరాముని అనుసంధానముతో నేటి అక్షరకిరణము గురించి.

క. శ్రీపు దయ విద్యఁ గాంచన్
బ్రాపుగ మేలౌను గనుకఁ బ్రథకై సర్వుల్
చేపట్ట వలయు నక్షర
దీపంబులు లోకమెల్ల దేదీప్యముగా.

శ్రీరామ నవరాత్రోత్సవాల సందర్భములో శ్రీ రామాలయములో ఏర్పాటు చేసిరి. ప్రియమిత్రులు, సహృదయ విద్వద్వరేణ్యులు, 'గీతాలంకార' శ్రీ తంగుడిగె నరసింహశాస్త్రిగారు నిర్వహించిరి.

# పరిశిష్టము

## వెంట్రుపల్లి

(కరీంనగర్ జిల్లా)        తేది. 13-11-76

**సభాధ్యక్షులు, కరీంనగర్ జిల్లా కలెక్టరు శ్రీ జి. పార్థసారథి ఐ.ఏ.ఎస్. గారి ప్రశంస :**

సీ. సద్గుణమణులచే సహృదయాగ్రణులచే
వినుతమౌ సుచరితన్ వెలయువారి
మాటలు పిడుగులై మనసు వెన్నయి ధర్మ
పథముఁ దప్పని కృపన్ వఱలువారి
నిత్యజాగ్రన్మతిన్ నిఖిలశాఖాఫల
సిద్ధికై కృషిసల్పఁ జెలఁగువారి
ప్రతిభావిభాసితపాండితీమండిత
రచనాచణత్వానఁ గ్రాలువారి

గీ. అంచితకళాలతాళిఁ బోషించు పుణ్య
రమ్యజయ మిడు పార్థసారథివరేణ్యు
కరినగరమండలాధ్యక్షుఁ గార్యదక్షు
పార్థసారథి రాయలఁ బ్రస్తుతింతు.

## తెలుగుతల్లి ప్రశంస :

ఉ. భారతమాతకున్ ప్రణయబంధురపుత్రికయై పవిత్రబా
గీరథి కృష్ణ మేల్ సుధలఁ గెంపుల సంపద నింప నింపుగా
వీరుల నాయకాళి సుకవివ్రజమున్ నటగాయకాదులన్
గూరిమిఁ గాంచి రాజిలు ననుంగు తెనుంగు తలిన్ భజించెదన్.

## మెట్టుపల్లి ప్రశంస :

క. ఖద్దరునకు నిలయంబై
సద్ధర్మాచరణమునకు సదనంబై మే
లుద్ధరణకు నిరవై సం
పద్ధుర్యత నెగడు మెట్టుపల్లి నుతింతున్.

ఆంధ్రావతరణోత్సవములలో మెట్టుపల్లి ఖాది గ్రామోద్యోగ ప్రతిష్ఠాన్‌లో ఏర్పాటు చేసిరి. ప్రియమిత్రులు, సహృదయ విద్వత్కవి. గాయక నట శేఖరులు శ్రీ డి.వి. మురళీమోహనాచార్యులు గారు సహకరించిరి.

# జగిత్యాల

(దరూర్ క్యాంపు) తేది: 29-3-1977

సమస్య :

నిష్క్రియముగ నింగిలోన నిచ్చెన నిలిచెన్.

క. దుష్క్రియ లరు లొనరించఁగ
నిష్క్రియుఁడై చనక నరుఁడు నింగి కరికి రో
చిష్క్రింతి శరము లేయఁగ
నిష్క్రియముగ నింగిలోన నిచ్చెన నిలిచెన్.

ప్రియమిత్రులు, ధార్మికాధ్యాత్మిక జీవనులు, క్యాంపు ఉద్యోగి శ్రీ రామలింగముగా రేర్పాటు చేయించిరి సభకు మిత్రులు, సహృదయ విద్వత్కవివర్యులు, ఆంధ్రోపన్యాసకులు శ్రీ ఆరుట్ల భాష్యాచార్యులుగా రధ్యక్షత వహించిరి.

# బొంబాయి

తేది: 28-5-1977

**బొంబాయి ప్రశంస :**

సీ. స్వర్గచుంబితమహాసౌధోత్కరంబులు
పాతాళపతితకుటీతతులును
భువనమోహనదివ్యపురుషులు పూఁబోండ్లు
పరమవికారులౌ భ్రష్టజనులు
నందనోద్యానంబు నవ్వెడు వాటికల్
అతిహేయదుర్గంధయుతతలములు
అలకాధిపుని మించు నతులితైశ్వర్యులు
పిడుచకు గతిలేని బిచ్చగాండ్రు

గీ. దైవరూపులై చరియించు ధర్మమతులు
ఘోరరాక్షసులై రేఁగు క్రూరజనులు
సకలవైవిధ్యమున వెల్గు జగ మగుచును
వెలయు బొంబాయి నగరంబు వినుతిచేతు.

ఉ. మెండగు సత్పరిశ్రమల మేటికిఁ గోటికి నెక్కు సంపదన్
పండిన రాజకీయముల భవ్యకళాలతికామనోజ్ఞతన్
రెండవ రాజధానియయి నిండుగ భారతమాతకీర్తికిన్
దండిగ నెత్తినట్టి సుపతాకను బొంబయి సన్నుతించెదన్.

ఆత్మీయులు, ఆప్తులు, సరసోదార హృదయులు, నాటక రచయితలు, పద్మశాలి నాయకవర్యులు శ్రీ మానాల గంగారాముగారేర్పాటు చేయించిరి. ఆప్తులు, బొంబాయి కోరుట్ల పద్మశాలి సంఘాధ్యక్షులు శ్రీ చింతకింది వెంకటేశ్వరులుగారు సహకరించిరి. మాన్యులు, కోరుట్ల పద్మశాలి సంఘాధ్యక్షులు శ్రీ ఎక్కలదేవి లక్ష్మణగారు సభకధ్యక్షత వహించిరి. ఘన సన్మానము జరిగెను.

# పైడి మడుగు

(కరీంనగర్ జిల్లా)      తేది. 6-10-1977

**పైడి మడుగు ప్రశంస :**

సీ. పచ్చపచ్చని పైరు పచ్చలన్ రతనాల
బంగారు పంటలే పండుచుండ
పాల సంద్రమ్మును బోలు నదీతటా
కాదుల జీవన మ్మలరుచుండ
కామధేనువు లౌచు ఘనగోసహస్రమ్ము
పాఁడి పంటలఁ దోడుపడుచునుండ
కల్పవృక్షము లనన్ గ్రమమై వనతరు
విసర మిష్టార్థమ్ము లొసఁగుచుండ.

గీ. ప్రాజ్ఞనాయక వర్తక శ్రామికతతి
వివిధ వృత్తుల సంపదల్ వెలయుచుండ
గ్రామసీమలలో స్వర్గధామమైన
పైడి మడుగు సార్థకముగ పైడి మడుగు.

**శ్రీ నీలగిరి మురళీధరరావుగారి ప్రశంస :**

సీ. దయ వచ్చెనా తా నభయ మిచ్చి యర్థులన్
పేదలన్ సాదుల నాదుకొనును
కోపంబు వచ్చెనా క్షుభితుఁడై బ్రహ్మాండ
నాయకునిన్ లెక్కచేయ కణఁచు

హృదయ ముప్పొంగెనా ఎంతగానో మెచ్చి
యిచ్చి సంపదలు పోషించుఁ గళల
అక్రమాధర్మమ్ము లగపడెనా తప్పుఁ
డై చక్కఁబఱచు దాఁ గాగకుండు.

గీ. దక్షుఁడున్ గార్యముల మహాధ్యక్షుఁడుఁ బ్రజ
సద్యశశ్శాలి నాయకజాతిమౌళి
నీలగిరి వంశదుగ్ధవార్నిధి విధుండు
రాజశ్రీ మురళీధరరావుఁ దలఁతు.

మాన్యులు,సరసోదార హృదయులు నాయకవర్యులు శ్రీ నీలగిరి మురళీధరరావుగా రేర్పాటు చేయించిరి. మెట్టుపల్లి పంచాయతి సమితి అధ్యక్షులు, నాయకవరేణ్యులు శ్రీ వర్ధినేని వెంకటేశ్వరరావుగారు సభ కధ్యక్షత వహించిరి.

# కోరుట్ల

తేది. 1977

**కళాశాలా విద్యార్థినీ విద్యార్థులకు, అధ్యాపకులకు శుభాకాంక్షలు :**

చ. ఆదరమున్ రసజ్ఞతయు హార్దికమౌ నభిమానమాధురుల్
మేదురమై వధానమును మెచ్చఁగ నిచ్చట నిర్వహించి న
న్నాదుకొనంగ సన్మతి మహార్థ మొసంగిన శిష్యకోటినిన్
నాదు సఖాళి నీశ్వరుఁ డనారత మభ్యుదయాళిఁ బ్రోచుతన్।

సీ. చాలినయంద రాచార్యుల లేమిచే
బాలుర గోల గగ్గోలుపడుచు
సరిపోవు నంతటి స్థలముల కొఱఁతచే
అంగడి లొల్లితో భంగపడుచు
ప్రభుత సమస్యలన్ బడి లెస్స తోడ్పడ
కుండ పోషకులచే మండిపడుచు
వ్రాఁత కోఁతలతోఁ దరముగాక యధ్యాప
కుల యలజడిచేతఁ గలఁతపడుచు

గీ. కంటకములు పీడించు మార్గముల లోన
సాగిపోయెడు మా కళాశాల బండి
సర్వవిధబృహత్కృషి చేతఁ జక్కఁబడుచు
ప్రగతిపథమునఁ బయనించి వఱలుఁగాక!

క. మెదడులు కరఁగఁగఁ జక్కని
చదువులతో సామొనర్చి సత్పౌరులు పెన్
బదవీస్థితులయి బాలురు
ముదమున భరతాంబఁ గొలిచి పొలుతురు గాకన్!

కోరుట్ల ప్రభుత్వ జూనియర్ కళాశాలలో నా సహోపాధ్యాయులు, ఆత్మీయులు, ఆప్తులు శ్రీ అలిశెట్టి మహారాజుగారు, శ్రీ బొద్దున గంగారాముగా రేర్పాటు చేయించిరి. అధ్యాపకులు విద్యార్థులు సహకరించిరి.

# మల్యాల

(కరీంనగర్ జిల్లా)      తేది : 28-3-1982

**శివప్రార్థన :**

క.  శ్రీపరమేశ్వరుఁ గరుణా
కూపారున్ భక్తరక్షకున్ శుభకరునిన్
దాపహరుఁ దలఁతు సభ విజ
యోపేతంబై చెలంగ నూర్జితభక్తిన్.

**మల్యాల ప్రశంస :**

ఉ.  శ్రీలకుఁ బెన్నిధానమయి చిత్రవిచిత్రము లైన దివ్యవ
స్త్రాలకుఁ నాపణంబయి ప్రశస్తకళావళి కాలవాలమై
ప్రాలకుఁ బాలకున్ విమల భక్తికి మందిరమై తనర్చు మ
ల్యాలకు రాజనైతిక కలాప విశాలకు సంతసించెదన్.

**సద్యోవర్ణనము :**

మల్యాలలో శివ పంచాయతన ప్రతిష్ఠ, పూర్వపు సి. నారాయణ రెడ్డిగారి సన్మాన సభ, ఈ అవధాన సభ, వెన్నెల ఆకాశము సమన్వయించి చెప్పుట.

మ.  శివపంచాయతన ప్రతిష్ఠ వెలయన్ జెల్వొందు మల్యాలలో
స్తవనీయంబుగ మున్ సినారె సభ యౌదాత్త్యంబునన్ జేయఁగా
నవధానం బిపు డాచరించఁ గవిప్రాజ్ఞాళిన్ బ్రకాశించు, ఆ
దివి జ్యోత్స్నన్ విలసిల్లు చందమున నెంతే నీ పురం బింపుగా.

ప్రియమైన పూర్వ విద్యార్థి శ్రీ కల్లెడ సోమయ్య ప్రోత్సాహముతో మల్యాల పౌరు లేర్పాటు చేసిరి. శ్రీ శివపంచాయతన ప్రతిష్ఠా సందర్భములో జరిగిన ఈ సభకు ప్రధానోపాధ్యాయులు, మిత్రులు, సహృదయ విద్వత్కవివర్యులు శ్రీ ఎం. వి. నరసింహారెడ్డిగారధ్యక్షత వహించిరి. పుర ప్రముఖులు, ప్రముఖ వర్తకులు శ్రీ కటుకం రాజన్న గారు సహకరించిరి.

# సిరిసిల్ల

తేది. 12-11-19(

సిరిసిల్ల ప్రశంస :

ఉ. శ్రీలకు నాకరంబయి విశిష్టగుణోత్తరదివ్యభవ్యవ
స్త్రాలకు మందిరంబయి ప్రశస్తకళాకమనీయశాస్త్రవి
ద్యాలతికాలవాలమయి దానదయాదుల కిక్కయైన శ్రీ
శాలను సన్నుతించెదను స్వాంతము సొంతము సంతసింపఁగన్

శ్రీ చిట్యాల బాలదాసకవి ప్రశంస :

మ. రుచిరగ్రంథములన్ రచించి కడు పౌరోహిత్యమున్ జేసి మేఁ
శుచిమజ్జీవనయాత్రచేయుచు సదాజ్యోతిష్కశాభిజ్ఞుడై
ప్రచురప్రజ్ఞ లమానవావళికి ధర్మంబున్ బ్రబోధించుచున్
ఉచితజ్ఞుండగు బాలదాసకవి నోహో! సంస్తుతిన్ జేసెదన్.

దత్తపది :

ఏలా, బాలా, లీలా, మేలా - రామాయణార్థములో.

ఏలా నన్ను దయామతిన్ గనవు నిన్నెంతెంత ప్రార్థించినన్
బాలా! రాముని గీమునిన్ దలఁతువే వ్యర్థంబుగా మాటికిన్
లీలాలోలత నీకు భోగములు కల్పింతున్ గటాక్షించవే
మేలా? ఈ త్రిజగత్పతిన్ గనక కూర్మిన్, ధిక్కృతిన్ జేసినన్.

మిత్రులు శ్రీ చిట్యాల బాలదాసకవిగారు తమ 'మానవ వికాస మంజరి' కావ్యావిష్కరణ నాచేత చేయించి ఈ అవధాన మేర్పాటు చేసిరి. సభకు నాయకవర్యులు, సరసోదార హృదయులు, ఆప్తులు శ్రీ రుద్ర శంకరయ్యగా రధ్యక్షత వహించిరి.

